(120)

శ్రీ మహాగణపతయే నమః | శ్రీ మహాసరస్వత్యై నమః | శ్రీ దక్షిణామూర్తయే నమః

వసంతఋతువు 2023 - మార్చి నెల

| ఇం.తేది | గ్ర.ప్ర. | స్వస్తిశ్రీ చాంద్రమాన శ్రీ శోభకృతు నామ సం॥ చైత్ర మాసం - సామాన్యధరలు |
|---|---|---|
| 22 | బు<br>గు.వృ | **శు.ప్రతిపత్** రా.8:21. **బుధ ఉత్తరాభాద్ర** సా.3:31. శుక్ల ప.9:15. బ్రహ్మ రా.తె.6:12. కింస్తుఘ్నం ప.9:33. బవ రా.8:21. **వర్జ్యం** రా.తె.2:49ల04:19వ. దు.మ.11:51ల12:39వ. అమృ.ఘ.మ.11:05ల12:34వ. **సూర్య.ఉదయం** 6:14. సు.అ.6:15. చంద్ర.ఉదయం ప.6:39. చం.అ.సా.6:59. ది.ప్ర.12:01. ఉత్తరాభాద్ర-4 బుధః రా.తె.3:43. శుభ.స.ప.9:34. గురు వృద్ధత్వప్రారంభం ◆ **ఉగాది, తైలాభ్యంగం, నింబకుసుమభక్షణం, ప్రపాదానం, వసంతనవరాత్రి ప్రారంభం, యాగకాలం** |
| 23 | చం<br>శు | **శు.ద్వితీయా** సా.6:21. **గురు రేవతి** మ.2:07. ఐంద్ర రా.తె.3:40. బాలవ ప.7:17. కౌలవ సా.6:21. తైతిల రా.తె.5:34. **వర్జ్యం** లేదు. దు.ఉ.10:14ల 11:02వ. పు.దు.మ.3:03ల03:51వ. అమృ.ఘ.మ.11:51ల01:22వ. **సు.ఉ.**6:13. సు.అ.6:15. చం.ఉ.ప.7:19. చం.అ.రా.7:55. ది.ప్ర.12:02. **మేషే** చంద్రః మ.2:07. భరణీ-1 శుక్రః ఉ.9:51. శుభ.స.ప.9:33. ◆ **ఉమా-శివ-అగ్నిపూజ, చంద్రదర్శనం.** దక్షిణశృంగం, సామాన్య ధరలు |
| 24 | బు | **శు.తృతీయా** సా.4:59. **శుక్ర అశ్వినీ** మ.1:21. వైధృతి రా.తె.1:40. గరజ సా.4:59. వణిజ రా.తె.4:35. **వర్జ్యం** ప.9:28ల11:01వ. పునః **వర్జ్యం** రా.10:55ల12:31వ. దు.ఉ.8:37ల09:25వ. పు.దు.మ.12:38ల01:26వ. అమృ.ఘ.ప.6:23ల07:56వ. **సు.ఉ.**6:13. సు.అ.6:16. చం.ఉ.ప.7:59. చం.అ.రా.8:52. ది.ప్ర.12:03. రేవతి-1 బుధః రా.7:24. శుభ.స.మ.1:34. ◆ **ఉత్తమమన్వాది, సౌభాగ్య గౌరీవ్రతం, సౌభాగ్యశయనవ్రతం, మాసగౌరీవ్రతం, శివడోలోత్సవం, ప్రదోషం** |
| 25 | ర చం<br>గు శు | **శు.చతుర్థీ** సా.4:22. **శని భరణీ** మ.1:17. విష్కంభ రా.తె.12:17. విష్టి/భద్రా సా.4:22. బవ రా.తె.4:22. **వర్జ్యం** రా.తె.1:38ల03:17వ. దు.ఉ.6:12ల07:48వ. అమృ.ఘ.ప.8:30ల10:06వ. **సు.ఉ.**6:12. సు.అ.6:16. చం.ఉ.ప.8:42. చం.అ.రా.9:49. ది.ప్ర.12:04. ఉత్తరాభాద్ర-3 రవిః ఉ.7:39. **వృషభే** చంద్రః రా.7:24. రేవతి-3 గురుః మ.11:19. భరణీ-2 శుక్రః రా.తె.4:45. శుభ.స.ప.10:33. ◆ **గణేశచతుర్థీ(గణేశపూజ)** |
| 26 | బు<br>గు.అ | **శు.పఞ్చమీ** సా.4:32. **ఆది కృత్తికా** మ.1:59. ప్రీతి రా.11:28. బాలవ సా.4:32. కౌలవ రా.తె.4:54. **వర్జ్యం** లేదు. దు.సా.4:39ల05:28వ. అమృ.ఘ.మ.11:31ల01:10వ. **సు.ఉ.**6:11. సు.అ.6:16. చం.ఉ.ప.9:26. చం.అ.రా.10:45. ది.ప్ర.12:05. రేవతి-2 బుధః మ.11:13. శుభ.స.ప.7:31. రేవతి-3 మీనే పశ్చాదస్తమితః గురుః రా.6:40. ◆ **నాగపూజ, శ్వేతవరాహకల్పం, శ్రీపంచమీ(లక్ష్మీపూజ)** |
| 27 | చం<br>కు<br>బు | **శు.షష్ఠీ** సా.5:27. **సోమ రోహిణీ** మ.3:26. ఆయుష్మాన్ రా.11:16. తైతిల సా.5:27. **వర్జ్యం** ప.6:57ల08:39వ. పునః **వర్జ్యం** రా.9:31ల11:15వ. దు.మ.12:37ల01:26వ. పు.దు.మ.3:02ల03:51వ. అమృ.ఘ.మ.12:02ల01:44వ. **సు.ఉ.**6:10. సు.అ.6:16. చం.ఉ.ప.10:14. చం.అ.రా.11:41. ది.ప్ర.12:06. **మిథునే** చంద్రః రా.తె.4:24. ఆర్ద్ర-1 కుజః ఉ.10:30. రేవతి-3 బుధః రా.తె.3:28. శుభ.స.మ.11:32. ◆ **సూర్యపూజ, ఉభయప్రదోషం** |





## బల్లిశాస్త్రము

| పురుషులకు | | | స్త్రీలకు | | |
|---|---|---|---|---|---|
| తలమీద | - | కలహం | తలమీద | - | మరణ సంకటం |
| బ్రహ్మరంధ్రమున | - | మృత్యువు | కొప్పుపై | - | రోగభయం |
| ముఖము | - | ధనలాభం | పిక్కలు | - | బంధు దర్శనము |
| ఎడమకన్ను | - | శుభం | ఎడమకన్ను | - | భర్తప్రేమ |
| కుడికన్ను | - | అపజయం | కుడికన్ను | - | మనోవ్యధ |
| నుదురు | - | బంధు సన్యాసం | వక్షము | - | అత్యంతసుఖం, పుత్రలాభం |
| కుడిచెవి | - | దుఃఖము | కుడిచెవి | - | ధనలాభం |
| ఎడమ చెవి | - | లాభము | పై పెదవి | - | విరోధములు |
| పై పెదవి | - | కలహము | క్రింది పెదవి | - | నూతన వస్తులాభము |
| క్రింది పెదవి | - | ధనలాభం | రెండు పెదవులు | - | కష్టము |
| రెండు పెదవులపై | - | మృత్యువు | స్తనమునందు | - | అధిక దుఃఖము |
| నోటియందు | - | రోగప్రాప్తి | వీపునందు | - | మరణవార్త |
| ఎడమమూపు | - | జయం | గోళ్ళయందు | - | కలహము |
| కుడిమూపు | - | రాజభయం | చేతియందు | - | ధననష్టము |
| చేతియందు | - | ధననష్టము | కుడిచేయి | - | ధనలాభము |
| మణికట్టునందు | - | అలంకారప్రాప్తి | ఎడమచేయి | - | మనోచలనము |
| మోచేయి | - | ధనహాని | వ్రేళ్ళపై | - | భూషణ ప్రాప్తి |
| వ్రేళ్ళపై | - | స్నేహితులు రాక | కుడిభుజము | - | కామ రతి సుఖము |
| కుడిభుజము | - | కష్టము | బాహువులు | - | రత్నభూషణ ప్రాప్తి |
| ఎడమ భుజము | - | అగౌరవము | తొడలు | - | వ్యభిచారము, కామము |
| తొడలపై | - | వస్త్రనాశనము | మోకాళ్ళు | - | బంధనము |
| మీసములపై | - | కష్టము | చీలమండలు | - | కష్టము |
| పాదములు | - | కష్టము | కుడికాలు | - | శత్రునాశనము |
| పాదములవెనుక | - | ప్రయాణము | కాలివ్రేళ్ళు | - | పుత్రలాభం |
| కాలివ్రేళ్ళు | - | రోగపీడ | | | |

బల్లి మీద పడగానే స్నానము చేయుట, లేదా విష్ణుకంచి వెళ్ళినవారిని స్పృశించుట మంచిది. బల్లి క్రింది నుండి పైకి ప్రాకి వెంటనే దిగినచో మంచిది తలమీద నుండి క్రిందికి దిగిన హాని కలుగును

## రజస్వలకు మంచి కాలము



అశ్వని, రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనురాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ట, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి ప్రథమ రజస్వలకు మంచి నక్షత్రములు. గ్రహణకాలం సంధ్యాకాలం, వర్జ్యకాలం మంగళవారం, అమావాస్య రోజులలో అయినచో శాంతి చేయించుకొనవలెను. జన్మ నక్షత్రమునకు నైధనతార రోజున రజస్వల అయినచో శాంతి అవసరము.

## అమృతాది యోగములు

| నక్షత్రం | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | అమృ | అమృ | సిద్ధ |
| భరణి | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| కృత్తిక | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ |
| రోహిణి | సిద్ధ | అమృ | అమృ | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ |
| మృగశిర | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| ఆర్ద్ర | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | సిద్ధ |
| పునర్వసు | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ |
| పుష్యమి | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ |
| ఆశ్రేష | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | మృత్యు |
| మఘ | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | అమృ | మృత్యు | అమృ |
| పుబ్బ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| ఉత్తర | అమృ | సిద్ధ | అమృ | అమృ | మృత్యు | సిద్ధ | మృత్యు |
| హస్త | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | మృత్యు |
| చిత్త | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| స్వాతి | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | అమృ | సిద్ధ | అమృ |
| విశాఖ | మృత్యు | మృత్యు | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| అనురాధ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| జ్యేష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | సిద్ధ | ప్రబ | మృత్యు | సిద్ధ |
| మూల | అమృ | సిద్ధ | అమృ | మృత్యు | సిద్ధ | అమృ | సిద్ధ |
| పూ.షా. | సిద్ధ | ప్రబ | సిద్ధ | అమృ | సిద్ధ | ప్రబ | సిద్ధ |
| ఉ.షా. | అమృ | మృత్యు | ప్రబ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శ్రవణం | అమృ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ |
| ధనిష్ఠ | మృత్యు | సిద్ధ | సిద్ధ | ప్రబ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| శతభిషం | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ |
| పూ.భా. | సిద్ధ | మృత్యు | మృత్యు | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు |
| ఉ.భా. | అమృ | సిద్ధ | అమృ | సిద్ధ | సిద్ధ | సిద్ధ | సిద్ధ |
| రేవతి | అమృ | సిద్ధ | సిద్ధ | మృత్యు | సిద్ధ | అమృ | ప్రబ |

అమృ - అమృతయోగము, సిద్ధ - సిద్ధయోగము
ప్రబ - ప్రబలారిష్టము మృత్యు - మృత్యుయోగము





## నవరత్నములు

(ధరించవలసిన వారి నక్షత్రములు)

| వైఢూర్యం | పుష్యరాగం | పచ్చ |
|---|---|---|
| అశ్వని<br>మఘ<br>మూల | పునర్వసు<br>విశాఖ<br>పూర్వాభాద్ర | ఆశ్రేష<br>రేవతి<br>జ్యేష్ఠ |
| **నీలం** | **కెంపు** | **వజ్రం** |
| పుష్యమి<br>ఉత్తరాభాద్ర<br>అనురాధ | కృత్తిక<br>ఉత్తర<br>ఉత్తరాషాఢ | భరణి<br>పుబ్బ<br>పూర్వాషాఢ |
| **గోమేధికం** | **పగడం** | **ముత్యం** |
| ఆర్ద్ర<br>స్వాతి<br>శతభిషం | మృగశిర<br>చిత్త<br>ధనిష్ఠ | రోహిణి<br>శ్రవణం<br>హస్త |

## తేనెపట్టు, అరటిగెల, మొండిచేయి - దిశాఫలితాలు

**తేనెపట్టు :** తూర్పున యజమానికి ధనలాభం, ఆగ్నేయమున అగ్నిభయం, దక్షిణమున మరణము, నైఋతి - ధాన్య నాశనము, పడమర - మనోపీడ, వాయవ్యం - ధననష్టం, ఉత్తరం - పుత్రలాభం, ఈశాన్యం - బంధుమిత్రలాభం

**అరటిగెల :** తూర్పు - శుభం; ఆగ్నేయం - శతృవృద్ధి, దక్షిణం - బంధుమిత్ర నాశనం, నైఋతి - పుత్రలాభం, పడమర - విపత్తు, వాయవ్యం - నేత్రహాని, ఉత్తరం - ఐశ్వర్యం, ఈశాన్యం - కీర్తిలాభం

**మొండిచెయ్యి :** తూర్పు - యజమానికి, నైఋతి - పుత్రులకు, వాయవ్యం - పశువులకు, ఉత్తరం, ఈశాన్యం - భార్యకు కీడు, ఆగ్నేయం - అగ్నిభయం, పడమర మరణం కలుగును.

## శాంతి విధానము

పై మూడు అంశములేకాకుండా ఇంటిలోకి గుడ్లగూబ వచ్చిననూ లేక గబ్బిళాలు వచ్చిననూ శాస్త్రతః పెద్ద శాంతులు చెప్పబడ్డాయి. అయితే అన్ని ఆచరించుటకు శక్తి అందరికీ ఉండదు. అందువలన గృహములో రుద్రహోమము లేదా రుద్రాభిషేకము చేయించుకోవడం వలన దోషము తగ్గుతుందని పెద్దలు చెబుతారు. బల్లి మీద పడినప్పుడు వెంటనే శిరస్నానము చేయుట మంచిది. దుస్స్వప్న దోష పరిహారం కోసం రుద్రాభిషేకము చేయించుకోవటం మంచిది. ప్రయాణమై వెళ్ళునప్పుడు శకునం సరిగా లేకపోతే అక్కడే (కాంపౌండు గేటు) కూర్చుని ఒక గ్లాసుడు మంచినీళ్ళు త్రాగి మంచి శకునం చూసుకొని బయలు దేరాలి. వెనుకకు రావటం కూడా అపశకునమే.

# ప్రయాణమునకు శుభ సమయములు

**శుభతారలు :** అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, అనురాధ, మూల, శ్రవణం, ధనిష్ఠ, రేవతి నక్షత్రములు శ్రేష్ఠములు. రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, శతభిషం మధ్యమములు. తక్కిన తారలు నిషిద్ధములు. మంచి నక్షత్రములందు వారశూలలూ, ఆనందాది యోగములూ చూచుకొని ప్రయాణిం చవలెను. ఉభయ పక్షములందలివిదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి తిధులు మరియు కృష్ణ పాడ్యమి మంచివి.

**శుభ వారములు :** తూర్పునకు మంగళవారం, దక్షిణమునకు సోమ, శని వారములు, పడమరకు బుధ, గురువారములు, ఉత్తరమునకు ఆది,. శుక్ర వారములు మంచివి.

## ప్రయాణమునకు కూడని తిథి, వార, శూలలు

| దిక్కు | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు |
|---|---|---|---|---|
| తూర్పు | 1-9 | శని-సోమ | జ్యేష్ఠ-ధనిష్ఠ | తుల-కుంభం |
| ఆగ్నేయం | 3-11 | శని-గురు | --- | మకరం |
| దక్షిణం | 5-13 | గురు | శ్రవణం-అశ్వని | మీనం వృశ్చికం |
| నైఋతి | 4-12 | సోమ-శుక్ర | --- | కర్కాటకం |
| పడమర | 6-14 | ఆది-శుక్ర | రోహిణి-పుష్యమి | ధనుస్సు-సింహం |
| వాయువ్యం | 7-15 | ఆది-మంగళ | --- | మేషం |
| ఉత్తరం | 2-10 | బుధ-మంగళ | పుబ్బ-హస్త | కన్య-వృషభం |
| ఈశాన్యం | 8-30 | బుధ | --- | మిథునం |

పై చక్రమందు చెప్పబడిన శూలలలో ప్రయాణము చేయరాదు. మరియు ఏకాదశి సోమవారం, ద్వాదశి శనివారం, షష్ఠి గురువారం, తదియ బుధవారం, అష్టమీ శుక్రవారం, నవమి ఆదివారం, పంచమీ మంగళవారం. ఇవి దగ్ధయోగ ములు. కావున ఆ రోజులలో అసలు ప్రయాణము చేయరాదు.

**కొత్త కాపురం :** ఆడపిల్లను క్రొత్తగా కాపురమునకు పంపుటకు ఆది, మంగళ, శుక్ర వారములు పనికిరావు. ఉగ్రదారుణ నక్షత్రములు దోష భూయిష్టము.

**నిర్ష్య విషయము :** నిషిద్ధ కాలములందు తప్పనిసరి ప్రయాణమైనచో ఆదివారం బంగారమును, సోమ - వస్త్రం, మంగళ - ఆయుధం, బుధ - పుస్తకం, గురు - గొడుగు, టోపి, తలపాగాలలో ఒకటి, శుక్ర - చెప్పులు లేదా వాహనం, శని - కంఠమున ధరించు వస్తువును - ప్రయాణ మార్గమందలి ఎవరి ఇంటినైనా నిర్ష్యముంచుకొని - అవసరవేళ శుభ శకునమున ప్రయాణమై వెళ్లవచ్చును. లేదా ప్రయాణమునకు తీసుకొని పోవు లగేజి అయినా ప్రక్క ఇంటిలో మంచి సమయంలో ఉంచి మనం ప్రయాణమై వెళుతూ తీసుకొని వెళ్ళవచ్చును. ప్రయాణం మొదలు తొమ్మిదవరోజు తిరుగుప్రయాణారంభం, తిరిగి ఇంట తొమ్మిదవరోజు ప్రవేశం నిషేధం. నవమినాడు ప్రయాణం చేయరాదు.





# ప్రయాణమునకు ఆనందాది యోగములు

| ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని | ఫలితములు |
|---|---|---|---|---|---|---|---|
| అశ్వ | మృగ | ఆశ్రే | హస్త | అను | ఉ.షా. | శత | ఆనంద 15రో. కార్యసిద్ధి |
| భర | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూ.భా | కాలదండ 27రో.కార్యసిద్ధి |
| కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | ధూమ్ర 15రో. కార్యనష్టం |
| రోహి | పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | ధాత్రి 4రో. కార్యజయం |
| మృగ | ఆశ్రే | హస్త | అను | ఉ.షా | శత | అశ్వ | సౌమ్య 30రో. సర్వసౌఖ్యం |
| ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | పూ.భా | భరణి | ధ్వాంక్ష 5రో. ధననాశం |
| పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | ధ్వజ 10రో. విజయం |
| పుష్య | ఉత్త | విశా | పూ.షా | ధని | రేవ | రోహి | శ్రీవత్స 3రో. సర్వసౌఖ్య |
| ఆశ్రే | హస్త | అను | ఉ.షా | శత | అశ్వ | మృగ | వజ్ర 2రో. కార్యనాశం |
| మఖ | చిత్త | జ్యేష్ట | అభి | పూ.భా | భర | ఆర్ద్ర | ముద్గద 1రో. కలహము |
| పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | ఉ.భా. | కృత్తి | పున | ఛత్ర 27రో. స్త్రీ లాభము |
| ఉత్త | విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | మిత్ర 27రో. మిత్రలాభం |
| హస్త | అను | ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్రే | మానస 27రో. మిత్రలాభం |
| చిత్ర | జ్యేష్ట | అభి | పూ.భా | భర | ఆర్ద్ర | మఖ | పద్మ 15రో. ఐశ్వర్యప్రాప్తి |
| స్వాతి | మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | లంబ 3రో. చికాకులు |
| విశా | పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | ఉత్పాత 4రో. కష్టములు |
| అనూ | ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్రే | హస్త | మృత్యు 10రో. భయం |
| జ్యేష్ఠ | అభి | పూ.భా | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | కాల 5రో. అవమానం |
| మూల | శ్రవ | ఉ.భా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | సిద్ధి 4రో. సిద్ధి |
| పూషా | ధని | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | శుభ 4రో. కార్యజయం |
| ఉషా | శత | అశ్వ | మృగ | ఆశ్లే | హస్త | అనూ | అమృత 2రో. కార్యసిద్ధి |
| అభి | పూభా | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | ముసల 8రో. దుఃఖం |
| శ్రవ | ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | గద 10రో. చెరుపు |
| ధ | రేవ | రోహి | పుష్య | ఉత్త | విశాఖ | పూ.షా | మాతంగ 2రో. అశ్వలాభం |
| శత | అశ్వ | మృగ | ఆశ్రే | హస్త | అను | ఉ.షా. | రాక్షస 2రో. కలహం |
| పూభా | భర | ఆర్ద్ర | మఖ | చిత్త | జ్యేష్ఠ | అభి | చర 8రో. దుర్వార్త |
| ఉభా | కృత్తి | పున | పుబ్బ | స్వాతి | మూల | శ్రవ | స్థిర 3రో. మిశ్రమ |
| రేవ | రోహి | పుష్య | ఉత్త | విశా | పూషా | ధని | వర్ధమాన 10రో. ఉత్తమఫలం |

## శిశుజననము - నక్షత్ర పాద దోషములు

| నక్షత్రము | 1వ పాదము | 2వ పాదము | 3వ పాదము | 4వ పాదము |
|---|---|---|---|---|
| అశ్వని | శిశువునకు తల్లి గండం | మంచిది | మంచిది | మంచిది |
| భరణి | మంచిది | మంచిది | పితృమాతృ | శిశువునకు |
| కృత్తిక | మంచిది | మంచిది | పితృమాతృ | తల్లికి |
| రోహిణి | తల్లి, మే.కు | తల్లి, మే.కు | మే.మా.కు | మే.మా.కు |
| మృగశిర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ఆర్ద్ర | మంచిది | మంచిది | మంచిది | తల్లికి |
| పునర్వసు | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పుష్యమి | మంచిది | పితృమాతృ | పితృమాతృ | మంచిది |
| ఆశ్రేష | స్వల్పదోషం | ధనహాని | మాతృగండం | శాంతి |
| మఘ | తండ్రికి | తండ్రికి | మంచిది | స్వల్పదోషం |
| పుబ్బ | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| ఉత్తర | పితృమాతృ | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| హస్త | మంచిది | మంచిది | పితృమాతృ | మంచిది |
| చిత్త | పితృమాతృ | పితృమాతృ | స్వల్పదోషం | సౌ.శాంతి |
| స్వాతి | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| విశాఖ | బంధుగండం | బంధుగండం | విశేషశాంతి | విశేషశాంతి |
| అనురాధ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| జ్యేష్ఠ | సౌఖ్యహాని | ధనహాని | పితృగండం | సోదరగండం |
| మూల | పితృమాతృ | పితృగండం | ధనహాని | మంచిది |
| పూ.షాఢ | మంచిది | మంచిది | పితృమాతృ | మంచిది |
| ఉ.షాఢ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శ్రవణం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| ధనిష్ఠ | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| శతభిషం | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| పూ.భాద్ర | మంచిది | మంచిది | మంచిది | స్వల్పదోషం |
| ఉ.భాద్ర | మంచిది | మంచిది | మంచిది | మంచిది |
| రేవతి | మంచిది | మంచిది | మంచిది | శిశుగండం |

**వివిధ దోషాలు :** శిశువు వర్జ్యం, దుర్ముహూర్తం, అమావాస్య, గ్రహణ సమయములందుగాని, ఒకప్పుడు ప్రేగులు మెడకు చుట్టుకొనిగాని పుట్టిన లేదా తల్లిదండ్రులు, సోదరసోదరీల జన్మ నక్షత్రాలందు గాని జన్మించినచో శాంతి తప్పక చేయవలెను. హోమశాంతి, అమ్మవారికి కుంకుమార్చన, రుద్రాభిషేకము జరుపవలెను.





## శంఖుస్థాపన

తూర్పు సింహ ద్వారమునకు వైశాఖ, శ్రావణ, ఫాల్గుణములు, దక్షిణ సింహ ద్వారమునకు శ్రావణం కార్తీకం, పడమర సింహ ద్వారమునకు కార్తీక, మార్గశిర, మాఘములు, ఉత్తర సింహ ద్వారమునకు కార్తీక, మార్గశిర, మాఘములు అను కూలము ఉదయం 3.00 నుండి పగలు 12.30 వరకు శంకుస్థాపన చేయవచ్చు.

## సింహద్వార నిర్ణయం

మేషరాశి వారికి-తూర్పు, దక్షిణం, ఉత్తరం, ఉత్తర ఈశాన్యం; వృషభ రాశి వారికి - తూర్పు ఈశాన్యం, పశ్చిమ వాయవ్యం, ఉత్తరం, ఉత్తర ఈశాన్యం; మిథునరాశి వారికి - తూర్పు ఈశాన్యం, పశ్చిమం, ఉత్తర ఈశాన్యం; కర్కాటక రాశివారికి - దక్షిణం, పశ్చిమం, పశ్చిమ వాయవ్యం, తూర్పు ఈశాన్యం, తూర్పు; సింహరాశివారికి-పశ్చిమ వాయవ్యం, తూర్పు, దక్షిణ ఆగ్నేయం; కన్యా రాశి వారికి - ఉత్తరం, దక్షిణ ఆగ్నేయం, దక్షిణం; తులారాశి వారికి - ఉత్తరం, ఉత్తర ఈశాన్యం, దక్షిణ ఆగ్నేయం, దక్షిణం; వృశ్చికరాశి వారికి-ఉత్తర ఈశాన్యం, దక్షిణం; ధనూరాశి వారికి - తూర్పు, ఈశాన్యం, తూర్పు, పశ్చిమం; మకరరాశి వారికి - తూర్పు, పశ్చిమం, పశ్చిమ వాయవ్యం; కుంభరాశి వారికి-దక్షిణ ఆగ్నేయం, పశ్చిమం, పశ్చిమ వాయవ్యం; మీనరాశి వారికి - దక్షిణ ఆగ్నేయం, దక్షిణం, పశ్చిమ వాయవ్యం, పశ్చిమం. ఇవికాక పేరును బట్టి నిర్ణయించే విధానం వున్నది. ఇది స్థలము యొక్క ఆకృతుల అనుగుణంగా మార్పు సంతరించు కొంటుంది.

గృహములో ధనము, నగలు వీటిని ఉత్తర, ఈశాన్య, తూర్పు దిశలలో మాత్రమే ఉంచాలి. మేషం, వృషభం, కన్య, తులా, మకరం, మీన రాశుల వారు ఉత్తర దిశలోను, మిథునం, సింహం, ధనస్సు రాశులవారు తూర్పు దిశలోను, కర్కాటకం, వృశ్చికం, కుంభరాశులవారు ఈశాన్యంలోను ధనం నిల్వవుంచితే ఆ నిల్వ వృద్ధిని చూపును. గృహములో పూజ తూర్పు, ఉత్తర దిశాముఖంగా వుండి చేయాలి. పడుకునేటప్పుడు తూర్పు, దక్షిణం వైపు శిరస్సు వుంచాలి.

## వాస్తు విషయమై చక్రశుద్ధి

| శంకుస్థాపన వృషభ చక్రం | | గృహప్రవేశం కలశ చక్రం | |
|---|---|---|---|
| 3 మృత్యువు | 17 ధనం | 1 శిరచ్ఛేదం | 17 నిర్ధనం |
| 7 దుర్దశ | 22 ధాన్యం | 5 ప్రవాసం | 21 గర్భస్రావం |
| 11 ధైర్యం | 25 సంపద | 9 అభయం | 24 లక్ష్మీప్రాప్తి |
| 14 భ్రమణం | 28 పశులాభం | 13 ధాన్యం | 27 ఆయుష్షు |

రవి ఉన్న నక్షత్రం మొదలు దిన నక్షత్రం వరకు లెక్కింపవలెను. శంకుస్థాపనకు వృషభచక్రం గృహప్రవేశమునకు కలశచక్రం చూడవలెను. వీటిలో పాఠాంతరములు ఉన్నాయి. అందువలన శాస్త్రజ్ఞులు గ్రహబలానికే కాని, చక్రశుద్ధికి ప్రాధాన్యత ఇవ్వలేదు.

# గృహ సంబంధ ముహూర్తములు



**స్థలం రిజిస్ట్రేషన్ చేయించుకొనుటకు :** మనం కొనుక్కున్న స్థలం రిజిస్టర్ చేయించుకోవడానికి చవితి, షష్ఠి, అష్టమి, ద్వాదశి, అమావాస్య తిథులు, భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, పూర్వఫల్గుణి, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాభాద్ర నక్షత్రములు, మంగళవారం కాకుండా చూసుకుని, స్థలము రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. అయితే రిజిష్టర్ చేయించుకునే సమయానికి వర్జ్యం, దుర్మహూర్తం, రాహుకాలం వుండకూడదు. వీలయినంత వరకూ శుభగ్రహ హోరల సమయంలో రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి.

## శంఖుస్థాపన చేయుటకు

**మాసములు :** చైత్రమున ధనహాని, వైశాఖం శుభం, జ్యేష్ఠం మరణం, ఆషాడం పశునాశనము, శ్రావణం భృత్యవృద్ధి, భాద్రపదం ప్రజాపీడ, ఆశ్వయుజం కలహప్రదం, కార్తీకం ధనలాభం, మార్గశిరం భయము, పుష్యం అగ్నిభయము, మాఘం అధిక సంపద, ఫాల్గుణం రత్నలాభం.

**నక్షత్రములు :** అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనురాధ, ఉషా, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి.

**వారములు :** ఆది, మంగళ, శని వారములు నిషేధము. అయితే శని, ఆది వారములు వాడుకలో ఆచారములో వున్నది.

**లగ్నబలం :** వీలయినంత వరకు పాపగ్రహ సంబంధంలేని ఏ లగ్నమయినా, లగ్నము అష్టమముతో పాపగ్రహములు లేని లగ్నము, కుజగురువులు బలంగా వున్న లగ్నం స్వీకరించాలి. పగలు శంఖుస్థాపన విశేషం. అలాగే బ్రహ్మముహూర్తం సూర్యోదయానికి ముందు రెండు గంటలు చాలావిశేషం గమనించాలి. గ్రహబలం వున్నను రాత్రికాలం సూర్యాస్తమయం నుండి రాత్రి 3-00 వరకు నిషేధము.



**బోరింగ్ లేదా బావి తీయుటకు ముహూర్తం :** హస్త, పుష్యమి, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, అనురాధ, శ్రవణ:, ధనిష్ఠ, శతభిషం, రేవతి, మఘ.... ఈ నక్షత్రములు శ్రేష్టము. ఆది, మంగళ, శని వారములలో తీయు బావులయందు నీరు ఎక్కువకాలం వుండదు. మీన, మకర, కర్కాటక, వృషభ, కుంభ లగ్నములందును, లగ్నానికి చతుర్థస్థానముకు పాపగ్రహ సంబంధం లేకుండాను చూచుకుని ముహూర్తం చేయవలెను. **జలరాశులు** "మత్స్యే కుళీరే మకరే బహూదకం, కుంభేవృషభే చార్థజల ప్రమాణం, అళ్యాంచ తౌల్యామ్ మిథునేన పాదం శేషేతు రాశౌ జలనాశంచ" - ఏ లగ్న మయినా లగ్నం, చతుర్థం గురు, శుక్ర బలం వున్న లగ్నంలో బోరింగ్ వేయవచ్చు.

**ద్వారం ఎత్తుటకు :** పాడ్యమి, విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పూర్ణిమ తిథులయందును, సోమ, బుధ, గురు, శుక్ర వారముల యందును,





శుభగ్రహ హోరలయందును ద్వారం ఎత్తవచ్చును. శ్లాబ్ విషయమై కూడా అంతే. వర్జ్య, దుర్మహూర్త, రాహుకాలములు విడిచి సూర్యోదయము మొదలు మధ్యాహ్నం లోపల శ్లాబ్ వేయుట ప్రారంభించాలి. అలాగే ద్వారం ఎత్తాలి. దీనికి కూడా ఆషాడ, భాద్రపద, పుష్య మాసములు పనికిరావు.

# గృహ ప్రవేశము



కాలామృతం ఆధారంగా వైశాఖంలో గృహప్రవేశం గృహ పతికి బహుపుత్రంబు. జ్యేష్ఠమాసం శుభప్రదము, ఫాల్గుణ మాసం సంపత్కరము, మాఘం ధాన్యప్రదము. అయితే ఉత్తరాయణంలో కుంభంలో రవి వుండగా తప్ప మిగిలినవి అన్నియు శ్రేష్ఠములే. బహుగ్రంథకర్తలు కార్తీక, మార్గశిర, శ్రావణ మాసములు శ్రేష్ఠములు అని తెలిపిరి. ఆశ్వయుజ మాసం ఆచారము ఉన్నది.

**వారములు :** ఆదివారము అత్యంత దుఃఖమును క్షీణేందు వారము (బహుళ పక్షంలో సప్తమి తర్వాత సోమవారం) కలహమును, పూర్ణేందు వారము సంపదను, మంగళవారము అగ్ని భయమును, బుధవారము ధాన్యమును, గురువారము పశుపుత్రులని, శుక్రవారము శుభసౌఖ్యములను, శనివారము స్థైర్యమును, చోరభయమును కలుగచేయును. ఆదివారము మరియు శనివారం నాడు రాత్రికాలము అత్యవసరస్థితిలో వాడవచ్చు.

**నక్షత్రములు :** చిత్త, అనురాధ, ధనిష్ఠ, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, రేవతి, శతభిషం, రోహిణి, మృగశిర ఈ నక్షత్రములు ప్రశస్తమైనవి. పుష్యమి మధ్యమము. పునర్వసు, స్వాతి, హస్త, అశ్వని, శ్రవణం నక్షత్రములలో గృహప్రవేశమయిన ఆ ఇల్లు అన్యాక్రాంతమగును. ఆర్ద్ర, కృత్తిక అగ్నిభయమును కలుగజేయును.

**లగ్నములు :** కర్కాటక లగ్నమున గృహప్రవేశము నాశనము, తులాలగ్నమున గృహప్రవేశము వ్యాధిని, మకర లగ్నమున గృహప్రవేశము ధాన్య నాశనమును, మేషలగ్నమున గృహప్రవేశము చలనమును కలుగజేయును. వృషభ, సింహ లగ్నములు స్థిరములు అయిన కారణముగా ఆ లగ్నములు గృహప్రవేశమునకు మంచివి. మిథున, కన్యా, ధనుర్మీన లగ్నములు సైతము శుభప్రదమైనవే. గృహప్రవేశం పగలు విశేషము. వాస్తు కర్మలకు రాత్రి కాలం కంటే పగలే విశేషం అని భరద్వాజ సూత్రం.

**విశేషములు :** గృహప్రవేశమునకు 4,8,12 స్థానములు శుద్ధిగా ఉండుట విశేషము. 4 గృహస్థానము, 8 ఆయుఃస్థానము, 12 వ్యయస్థానము అయిన కారణంగా ఈ స్థానములు శుద్ధిగా వుండవలెను. 3,6,11ల యందు పాప గ్రహములు, 1,2,4,5,7,9,10,11లలో శుభగ్రహములుండగా గృహప్రవేశము విశేషము.

## గ్రహముల స్వభావములు

రాహు, శని, కేతు, కుజులు క్రూర స్వభావ గ్రహములు. శుక్ర, గురు, బుధ, చంద్రులు సౌమ్య స్వభావ గ్రహములు. అయితే "బుధః పాపాయుతః పాపః క్షీణ చంద్రస్తదైవచ" అనగా పాపగ్రహములతో కలసిన బుధుడు పాపగ్రహముగాను, క్షీణచంద్రుని పాపగ్రహము గాను చెప్పబడినది. కుజ, రవి, గురువులు పురుష స్వభావ గ్రహములు. రాహు, చంద్ర, శుక్రులు స్త్రీ స్వభావ గ్రహములు. శని, బుధ, కేతువులు నపుంసక స్వభావ గ్రహములు. గురు, శుక్రులు బ్రాహ్మణ గ్రహ ములు; రవి, కుజులు క్షాత్ర గ్రహములు. చంద్ర, బుధులు వైశ్యులు. శని శూద్ర కులాధిపతి.

## క్షీణ చంద్ర వివరణ

చంద్రుడు శుక్ల అష్టమి లగాయతు కృష్ణ అష్టమి వరకు పూర్ణ బలవంతుడు. యిది సామాన్య నియమము. యిందలి విశేష పాఠమేమనగా కృష్ణ పక్షంలో పాడ్యమి నుండి పంచమి వరకు మిక్కిలి పూర్ణుడు. తదాది అయిదు రోజులు మధ్యమం. చివరి అయిదు రోజులు అనగా కృష్ణపక్ష ఏకాదశి నుండి అమావాస్య వరకు చంద్రుడు పూర్తి క్షీణ చంద్రుడు. దీనికి వ్యతిరేకముగా శుక్లపక్షమును ఊహించవలెను. అనగా శుద్ధపాడ్యమి నుండి పంచమి వరకు క్షీణచంద్రుడు. షష్ఠి ప్రభృతి దశమి వరకు మధ్యమం తదుపరి పూర్ణిమ వరకు పూర్ణ చంద్రుడుగా పరిగణించాలి. అయితే కృష్ణ పక్షంలో చివర 5 రోజులనే శుభకార్య విషయంగా ప్రాంతీయ ఆచారములను పరిధిలోకి తీసుకొని నిషేధించుచున్నారు.

## నక్షత్ర భేదములు

అశ్వని, హస్త, పుష్యమి నక్షత్రములు క్షిప్ర (శీఘ్ర) సంజ్ఞ నక్షత్రములు. మూల, ఆర్ద్ర, జ్యేష్ఠ, ఆశ్రేష నక్షత్రములు దారుణ నక్షత్రములు. చిత్త, రేవతి, మృగశిర, అనురాధ నక్షత్రములు మృదు (సౌమ్య) నక్షత్రములు. రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్రలు స్థిర (ధ్రువ) నక్షత్రములు. భరణి, మఘ, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలు ఉగ్ర నక్షత్రములు. కృత్తిక, విశాఖ సాధారణ నక్షత్ర ములు. స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం నక్షత్రములు చర నక్షత్రములు. దారుణ, ఉగ్ర, సాధారణ నక్షత్రములయందు ఏ విధమైన కార్యములు ప్రారంభింపరాదు.

## ఊర్ధ్వ, అధో, తిర్యఙ్ముఖ నక్షత్రములు

అశ్వని, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త, అనురాధ, జ్యేష్ఠ, రేవతి యివి తిర్యఙ్ముఖ నక్షత్రములు. భరణి కృత్తిక, ఆశ్రేష; పుబ్బ, విశాఖ మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర యివి అథోముఖ నక్షత్రములు. రోహిణి, మృగశిర, పుష్యమి, ఉత్తర, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర యివి ఊర్ధ్వముఖ నక్షత్రములు.





## తారాబలమ్

జన్మ నక్షత్రము నుండి లెక్కింపగా వరుసగా ఇరవై ఏడు నక్షత్రములకు జన్మ, సంపత్, విపత్, క్షేమ, ప్రత్యక్, సాధన, నైధన, మిత్ర, పరమమిత్ర అనబడే తొమ్మిది సంజ్ఞలు ఉంటాయి. ఇవే సంజ్ఞలు మరల 10వ నక్షత్రము నుండి 18 వరకు, మరల 19వ నక్షత్రం నుండి 27వ నక్షత్రం వరకు ఉంటాయి.

## జన్మ నక్షత్రంలో చేయదగిన కార్యములు

జన్మనక్షత్రమున నిషేకము, యాగము, చౌలకర్మ, అన్నప్రాశన, వ్యవసాయము, ఉపనయనం, రాజ్యపట్టాభిషేకం, భూసంపాదన, అక్షరాభ్యాసముల యందు శుభ ప్రదము. పుంసవనం, సీమంతం, యుద్ధము, గర్భాదానము, శ్రాద్ధము, క్షౌరము, ఔషధ సేవ, ప్రయాణములయందు అశుభప్రదము. స్త్రీలకు వివాహ విషయమై శ్రేష్ఠము.

## తారాబల ఫలమ్

సంపత్ తార సంపదలను, విపత్ తార కార్యనాశనమును, క్షేమతార క్షేమమును, ప్రత్యక్ తార కార్యనాశనమును, సాధన తార కార్యసాధనమును, నైధన తార హీనత్వమును, మిత్రతార సుఖమును, పరమమిత్ర తార సుఖసంపదలను కలుగ చేయును. అయితే అత్యవసర స్థితిలో ప్రథమ నవకంలో ప్రథమ నక్షత్రమును, ద్వితీయ నవకంలో విపత్‌తారను, తృతీయ నవకంలోప్రత్యక్ తారను విడిచి మూడు నవకములలో నైధన తారను విడిచి మిగిలిన నక్షత్రములలో ముహూర్తము చేయవచ్చును. ఒకవేళ కర్కాటక రాశికి, వృషభ రాశికి చెందు నక్షత్రములు తారాబల విషయంలో విపత్, ప్రత్యక్ తారలు అయినప్పటికీ శుభకార్యములు చేయవచ్చును. జన్మ నక్షత్రంలో నక్షత్రము పారంభం నుండి ఏడు ఘడియలు, విపత్తార యందు ప్రారంభ 3 ఘడియలు ప్రత్యక్ నైధన తారల యందు ప్రారంభ 8 ఘడియలు విడువవలెను. మిగిలిన ఘడియలు గ్రాహ్యము.

## పంచక రహితం

సుముహూర్త లగ్నమునకు వున్న తిథి, వార నక్షత్రము, లగ్న సంఖ్యలను (తిథి సంఖ్య శుద్ధ పాడ్యమి నుండి బహుళ పాడ్యమి నుండి వారసంఖ్య ఆదివారం లగాయతుగాను, అశ్వనీ లగాయతు, నక్షత్ర సంఖ్యను, మేషాధిగా లగ్నసంఖ్యను గ్రహించాలి.) కలిపి తొమ్మిది చేత భాగింపగా వచ్చు శేషములు మూడు, అయిదు, ఏడు, తొమ్మిది వచ్చిన విశేష శుభము. ఇవి కాని ఎడల "ఏకో మృత్యుర్ద్వ యోర్వ హ్నిం; చతుర్థోరాజపంచకం, షష్ఠచోరః, అష్టరోగః".

ఒకటి శేషము వున్న మృత్యు పంచకము, రెండు శేషం అయిన అగ్ని పంచకము, నాలుగు శేషము వున్న రాజపంచకము, ఆరు శేషము వున్న చోరపంచకము, ఎనిమిది శేషము వున్న రోగపంచకము అగును.

## మతాంతరం

లగ్నమును, లగ్న సమయమునకు వున్న తిథికి, వెనుక తిథిని కూడి తొమ్మిదిచే భాగించిన ఎడల వచ్చు శేషములకు పై ఫలితములే వచ్చును. అయితే మామూలుగా పంచకరహితం చేయగా మృత్యు పంచకము, అగ్ని పంచకము వచ్చిన యెడల వాటికి మతాంతరము చేయరాదు. కాని ఈ పంచకము దేశాచార వ్యవస్థను అనుసరించి ఉన్నది. ఇది కేవలం దక్షిణ దేశస్థులు వాడతారు.

రాజసేవకు, వ్యవహారమునకు రాజ పంచకమును, వాస్తు విషయంలో రాజు, అగ్ని పంచకములు, ప్రయాణమునకు చోరపంచకమును, ఉపనయన, వివాహాదుల విషయంలో రోగ, మృత్యు పంచకములు సర్వదా నిషేధము. వీటి విషయంలో మతాంతరం కూడదు. రాత్రిపూట చోర, రోగపంచకములను, పగలు రాజు, అగ్ని పంచకములను అర్థరాత్రి యందు మృత్యు పంచకమును వదలవలెను. ఆదివారము రోగ పంచకము, శనివారము మృత్యు పంచకము, మంగళవారము అగ్ని పంచకము, గురు, సోమవారముల యందు రాజ పంచకమును, బుధ, శుక్ర వారములయందు చోరపంచకమును గ్రహించి మతాంతరం చేయకూడదు.

## లగ్న ధృవాంకాః

మేషాది మీన పర్యంతము క్రమముగా 4,5,6, 5,4,3,2,1,0; 1,2,3 సంఖ్యలు ధృవకములగును. ప్రయాణము, వ్యవసాయము వంటి కృషి కర్మలయందు, వాణిజ్యము నందు, తటాకాదుల త్రవ్వకమునకు, శివలింగ ప్రతిష్ఠకు ధృవకరహితమును చూడవలెను.

## నామ నక్షత్ర వినియోగం

సంగ్రామ, వ్యవహారములకు, ధామార్వణం, నగరార్వణం, గ్రామార్వణం, మంత్రార్వణం విషయములలోను నామ నక్షత్రము చూడవలెను. ధామార్వణం విషయంలో కాలామృతం సంస్కృత వ్యాఖ్యానంలో క్షేత్రార్వణం అని వివరించిన కారణంగా గృహము ఏ దిశలో కట్టుకోవాలి. ఆయాది వివరణల విషయంగా నామనక్షత్రం వాడి ముహూర్త విషయంలో జన్మనక్షత్రం ఉపయోగించవలెను.

## మౌఢ్యమునందు విడువవలసిన కార్యములు

వ్యాపారం, తటాక, కూప, గృహారంభ, గృహప్రవేశములు, వ్రతారంభ, వ్రతోద్యాపన, వధూప్రవేశ, మహాదాన సోమయాగాష్టకా శ్రాద్ధములు సంచయన, ప్రథమోపాకర్మ వేద వ్రతములు, కామ్యవృషోత్సర్గ వివాహాదులు, దేవతా ప్రతిష్ఠలు, దీక్షోపనయన చూడాకర్మలు, అపూర్వ దేవతీర్ధ దర్శనము, కన్యాగ్రహణము, అగ్నిస్వీకారము, రాజ దర్శనము, రాజ్యాభిషేకము, యాత్ర, సమావర్తనము. కర్ణవేధలు చేయకూడదు. అయితే మాస ప్రాధాన్యములైన సీమంతం, పుంస వనముల నామకరణ, అన్నప్రాశన వంటివి చేయవచ్చును.





## అధిక మాస, క్షయమాసములందు విడువతగినవి

సోమయాగాది కర్మాణి నిత్యాన్యపి మలిమ్లుచే తద్దైవాగ్రయణాధాన చాతుర్మాస్యాది కాన్యపి॥ మహాలయాష్టకా శ్రాద్ధోపాకర్మాద్యపికర్మయత్, స్పష్టమాస విశేషాఖ్య విహితం వర్జయేన్మలే॥ "అగ్న్యాధానం ప్రతిష్ఠాంచ యజ్ఞదాన వ్రతానిచ, వేద వ్రత వృషోత్సర్గ చూడాకర్మాణి మేఖలా॥ మాంగల్య మభిషేకంచ మలమాసే వివర్జయేత్, గృహప్రవేశ గోదాన స్థానాశ్రమ మహోత్సవం ॥ వాపీ కూప తటాకాది ప్రతిష్ఠాం యజ్ఞ కర్మచ, న కుర్యాన్మల మాసేతు సంసర్పాహస్పతౌ తథా"॥

ఈ విధమైన ఆధారములు పరిశీలించగా మలమాసమందు, క్షయమాసము నందును మౌఢ్యకాలమునందువలెనే (పైన చెప్పబడిన) కార్యములను విడువవలెను.

## సుశకునములు

మనశ్శాంతి లేని సమయంలో ప్రయాణము చేయకూడదు. బ్రాహ్మణులు, అశ్వములు, గజములు, ఫలములు, అన్నము, క్షీరము, గోవు, తెల్ల ఆవులు, పద్మ ములు, శుభవస్త్రములు, వేశ్యలు, మృదంగాది వాద్యములు, నెమళ్ళు, పాలపక్షి, ముంగిస, బద్దెక పశువు, మాంసము, శుభవాక్యములు వినుట, పుష్పములు, చెరకు, పూర్ణకలశములు, ఛత్రములు, మృత్తిక, కన్య, రత్నములు, తలగుడ్డలు, తెల్ల గుడ్డలు, పుత్రసహిత స్త్రీ, అద్దము, రజకులు, మత్స్యములు, నెయ్యి, సింహా సనము, ధ్వజము, తేనె, మేకలు, అస్త్రములు, గోరోచనము, వేద ధ్వని, మంగళ గానములు యివి ఎదురువచ్చిన సుశకునముగా భావించి వెంటనే ప్రయాణం చేయవలెను.

## శూన్యమాస విచారణ

మీనములో రవి ఉండగా చైత్ర మాసము, మిథునంలో రవి ఉండగా ఆషాఢ మాసము, కన్యలో రవి ఉండగా భాద్రపద మాసము, ధనస్సులో ఉండగా పుష్యమాసము శూన్యమాసములు.

## శుభ స్వప్నములు

ఇష్టదేవతను చూచుట, పుష్పములు, పండ్లు, పసుపు, కుంకుమ, నిధి నిక్షేపములు, మంగళకరమగు వస్తువులను చూచుట, పసుపు పచ్చని వనములు మొదలగునవి. గుఱ్ఱములు, ఏనుగులు లేదా పల్లకీ మొదలగు వాహనములు ఎక్కినటులయు, తాను ఏదో ఒక బాధకు గురియైనట్లు, రక్తము చూచినట్లు, వేదము చదువునట్లు, పరస్త్రీని సంభోగించినట్లు, పాలు పెరుగు పుచ్చుకున్నట్లు, నూతన వస్తు, వస్త్రభూషణములు ధరించినట్లు కలగాంచుట శుభఫలదాయకము.

## పుట్టుమచ్చల ఫలితములు

ముక్కు మీద - కోపము, వ్యాపార దక్షత, కుడికన్ను-అనుకూల దాంపత్యము, ఎడమ కన్ను-స్వార్జిత ధనార్జన, నుదుటిమీద-మేధావి, ధనవంతులు, గడ్డము -విశేష ధనయోగము,

కంఠము-ఆకస్మిక ధనలాభము, మెడ మీద - భార్య ద్వారా ధనయోగము, మోచేయి-వ్యవసాయ రీత్యా ధనలబ్ధి, కుడిచేయి మణికట్టు నందు-విశేష బంగారు ఆభరణములు ధరించుట, పొట్టమీద - భోజనప్రియులు, పొట్టక్రింద-అనారోగ్యం, కుడి భుజము-త్యాగము, విశేషకీర్తి ప్రతిష్టలు, బొడ్డు లోపల - ధనలాభములు, కుడితొడ-ధనవంతులు, ఎడమతొడ - సంభోగం, చేతి బొటన వ్రేలు-స్వతంత్ర విద్య, వ్యాపారము, కుడిచేయి చూపుడు వ్రేలు-ధన లాభము, కీర్తి, పాదములమీద - ప్రయాణములు, మర్మస్థానం - కష్ట సుఖములు సమానం. ఇంకా ఎక్కువ విశేషాలు గ్రంథములలో చెప్పబడినవి.

## కాలములు

"ప్రదోషస్త్రి ముహూర్తం స్యాత్ రవావస్తంగతేసతి" ప్రదోషము అనగా సూర్యా స్తమయం లగాయతు మూడు ముహూర్తముల వ్యవధిని ప్రదోషకాలము అంటారు.

దిన ప్రమాణమును ఐదు భాగములు చేయగా అవి : సూర్యోదయాది, ప్రాతః కాలము, సంగవకాలము, మధ్యాహ్నకాలము, అపరాహ్ణకాలము, సాయంకాలం గాను తెలిసికొనవలెను.

ఇందు ప్రాత స్సంగవ మధ్యాహ్న కాలముల యందు మనుష్య, దైవసంబంధ కార్యములు చేయవలెను. వివాహాదులు, జపహోమాదుల వంటివి, అపరాహ్ణకాల ములో పిత్రుకార్యములు అనగా మాసికముల వంటి ఆబ్దికములు చేయవలెను.

**"దినాంతేచ నిశాంతేచ ముహూర్తం నైవకారయేత్"**

దినాంతకాలములోను, నిశాంతకాలములోను ముహూర్తములు చేయరాదు.

**"దినపూర్వార్ధలగ్నాశ్చ సర్వకర్మ ఫలప్రదా"**

సూర్యోదయాది నాల్గవ లగ్నము వరకు అనగా మధ్యాహ్నం 12 గం॥ల లోపుగా వచ్చు లగ్నములు సర్వకార్యములకు శుభ ఫలములను ఇచ్చును.

### కుతప కాలము

**అహ్నో ముహూర్తా విజ్ఞేయా దశపంచచ సర్వదా**

**తత్రాష్టమో ముహూర్తో యస్సకాలః కుతపస్స్మృతః**

దిన ప్రమాణమును పదిహేను ముహూర్తములుగా విభజించ వలెను. అందు ఎనిమిదవ ముహూర్తమును కుతపకాలము అంటారు.

### అభిజిత్ గోధూళి

**మధ్యందినగతే భానౌ ముహూర్తో భిజిద్వాహయః**

**సూర్యాత్సప్తమ లగ్నం యద్గోధూళికమితిస్మృతమ్**

సరిగా సూర్యుడు ఉన్న లగ్నము నుండి చతుర్థలగ్నము అభిజిత్ లగ్నం అనబడుతుంది. దిన ప్రమాణమునకు మధ్య కాలమును అభిజిత్ లగ్నం అంటారు. అలాగే సూర్యుడు ఉన్న లగ్నమునకు సప్తమ లగ్నమును గోధూళి లగ్నం అంటారు.

**"అభిజిత్సర్వ కార్యేషు శస్త్రం నాత్రో పనాయనమ్"**

అభిజిత్ ముహూర్తంలో అన్ని కార్యములు ప్రశస్తముగా చేయవచ్చును. కానీ ఉపనయనమునకు మాత్రం పనికిరాదు.





## పంచ పర్వములు

**కృష్ణాష్టమి చతుర్దశ్యష్యమావాస్యాచ పూర్ణిమా**

**సంక్రాంతిః పర్వతిథయో మునిభిః పరికీర్తితాః**

కృష్ణపక్ష అష్టమి, చతుర్దశియు, అమావాస్యయు, పూర్ణిమయు, రవి సంక్రాంతులను పంచపర్వములుగా తెలుపబడతాయి. ఈ పంచపర్వాలలో అక్షరాభ్యాసం, విద్యాభ్యాసం, ఉపనయనం వంటివి పనికిరావు.

## మృతి విషయమై చర్చనీయాంశాలు

స్త్రీలు బహిష్టు అయినప్పుడు-పురుడు వచ్చినప్పుడు, మరణము కలిగినను రాత్రి ప్రమాణము అనగా సూర్యాస్తమయము నుంచి మరుసటి రోజు సూర్యోదయము వరకు ఉన్నటు వంటి సమయాన్ని 3 భాగములు చేసి, అందు 1, 2 భాగములను ముందురోజుగాను, మూడవ భాగమైన యెడల మరుసటి రోజుగాను గుర్తించవలెను. గర్భిణి 5వ మాసం తరువాత జరిగే అబార్షన్‌లకు మీ ఇంటి ఆచారం ప్రకారంగా, మీ ఇంటి పురోహితుడ్ని కనుక్కొని అశౌచాదులు పాటించగలరు.

ఒక అశౌచము పడుతూఉండగా, మరొక అశౌచము తెలిసినయెడల ఆ 2వ అశౌచము పట్టనవసరం లేదు. జాతాశౌచములో ఉన్నప్పుడు మృతాశౌచము తెలిసినయెడల మృతాశౌచమునే ఆచరించవలెను.

వివాహమైన స్త్రీ విషయంలో పితామహ పితృవ్యాదేః ఊఢకన్యా స్నానమాచరేత్ అని శాస్త్రం. తల్లి, తండ్రి, అన్నదమ్ములు మినహా మిగతా ఎవరు కాలం చేసినా (పుట్టింటి తరపువారు) స్నానముతో సరి. భర్తకు లేని మైల భార్యకు ఉండదు. పురుషుల విషయంలో తన తండ్రి తరపు అన్నదమ్ములు, వారి పిల్లలు, వారి యొక్క సంతానం విషయంగా 10 రోజులు మృతాశౌచము. అమ్మ తరపు బంధువర్గములో అమ్మమ్మ, తాతయ్య, మేనమామలు మొదలగువారి విషయంగా 3 రోజులు మృతాశౌచము. అలాగే పిల్లనిచ్చిన అత్తమామలు, బావమరదులు విషయంగా కూడా 3 రోజులు. తర్పణాలలో వీరిని అనుసరించి వచ్చే వారి విషయంలో పక్షిణి అశౌచము ఆచారము ఉన్నది.

## ఘాత చక్రము

| రాశి | తిథి | వారం | నక్ష | చంద్ర | రాశి | తిథి | వారం | నక్ష | చంద్ర |
|---|---|---|---|---|---|---|---|---|---|
| మేషం | షష్టి | ఆది | మఘ | 1 | తుల | ద్వాద | గురు | శత | 3 |
| వృషభం | చవితి | శని | హస్త | 5 | వృశ్చికం | దశమి | శుక్ర | రేవతి | 7 |
| మిథునం | అష్టమి | సోమ | స్వాతి | 9 | ధనస్సు | విదియ | శుక్ర | భరణి | 4 |
| కర్కాటకం | షష్టి | బుధ | అనూ | 2 | మకరం | ద్వాద | మంగ | రోహి | 8 |
| సింహం | నవమి | శని | మూల | 9 | కుంభం | చవితి | గురు | ఆర్ద్ర | 11 |
| కన్య | అష్టమి | శని | శ్రవ | 10 | మీనం | తదియ | శుక్ర | ఆశ్లే | 12 |

## సంవత్సర సూతకములో దీపారాధన

తల్లిదండ్రులకు కర్మ చేసినవారు కర్మ అయిన మరునాటి నుండి నిత్య కర్మా నుష్ఠానము యథావిధిగా చేసుకోవచ్చును. కొత్తగా, అప్పుడప్పుడు చేసే విశేషమైన కార్యములు మాత్రమే పనికిరావు. ఈ కర్మకు ముందు నిత్యము దీపారాధన చేసే అలవాటు ఉంటే అది యథావిధిగా ఆచరించవచ్చును. అదేరీతిగా ఉపనయన అర్హత ఉన్నవారు నిత్యము సంధ్యావందనాది ప్రక్రియలు యథావిధిగా చేయవలెను. దేవతార్చన నిత్య నైవేద్యం అలవాటు ఉన్న కుటుంబాలలో వారు వారి అలవాటు ప్రకారంగా యథావిధిగా నిత్యకర్మలు ఆచరించవచ్చును. కొత్తగా సత్యనారాయణస్వామి వ్రతం వంటివి ఆచరించరాదు. దేవాలయములోనికి వెళ్ళుట, మీ పేరున పూజ చేయించుకొనుట, తీర్థ ప్రసాద స్వీకరణ పనికిరాదు. శుభకార్యములకు వెళ్ళి అక్షంతలు వేయుట పనికిరాదు. మరియు శుభకార్యము లలో కాని, ఇతరుల యొక్క పితృ కార్యక్రమములలో గానీ పాల్గొనుట పనికిరాదు. ఒకవేళ పాల్గొన్ననూ దూరముగా ఉండవలసిందే గానీ, కార్యక్రమములో పూజా సంభారములు వంటివి ముట్టుకోరాదు. ఇతరుల యొక్క పితృ కార్యములలో మీకు సర్వదా నిషేధమే.

## మృతి విషయమై చెడు నక్షత్రములు

పాడ్యమి, విదియ, షష్టి, సప్తమి, దశమి, ద్వాదశి, త్రయోదశి, చతుర్దశి అను తిథులు. ఆది, మంగళ, శుక్ర, శనివారములు; కృత్తిక, రోహిణి, మృగశిర, పునర్వసు, మఘ, ఉత్తర, చిత్త, విశాఖ, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి అను ఈ నక్షత్రములు దోషములు. వీటి యందు మృతి సంభవించినచో గృహమునకు దోషము. నక్షత్రము చెడుదైనచో అధిక దోషము – నక్షత్రము మంచిదై మిగిలినవి చెడువైనచో స్వల్ప దోషము – పరామర్శకు యివియే వర్తించును.

బంధువులు, మిత్రులు మరణించినప్పుడు వారిని పరామర్శించు టకు వెళ్ళి నప్పుడు, ఇంటికి వచ్చి స్నానం చేయాలి. మృతదేహాన్ని చూసినా స్నానం చేయాలి. తాకితే తలస్నానం చేయాలి. శవం వద్ద పూలు తొక్కినా, మీద పడినా తలస్నానం చేయాలి. ధనిష్టాపంచకములు (ధనిష్ట, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి) ఇవి మృతి సంబంధమైన విషయములో ఏ కార్యమునకు పనికిరావు.

నిద్రకు తీసుకువచ్చే విషయంలో మంగళవారం, శుక్రవారం పనికిరాదు. అలాగే ధనిష్టా పంచకము మరియు త్రిపాద నక్షత్రములు (విశాఖ, పునర్వసు, కృత్తిక) పనికిరావు. నిద్రకు కేవలం కర్త (కర్మ చేసిన వారు) యొక్క అత్తింటివారు తీసుకు రావడం ఆచారం. నేడు అందరినీ నిద్రకు తీసుకురావడం అనేది చేస్తున్నారు. అది పెద్ద అనాచారం అవుతుంది.

**గరుడ పురాణం కర్మకాండ చేయు 10 రోజులు నిత్యం పారాయణ చేయించవలెను.**
**భక్తి శ్రద్ధ లేకుండా పితృకార్యములు చేయరాదు.**





## పితృతిథి నిర్ణయము

పితృతిథి అపరాహ్ణకాలమునకు ఉండవలెను. దీనినే అపరాహ్ణవ్యాప్తి యందురు. తిథి అపరాహ్ణ ప్రారంభము నుండి అంతము వరకు ఉండుట మొదటి పక్షము లేక, అపరాహ్ణ ప్రారంభమునకైనను యుండుట రెండవ పక్షము. అట్టి అపరాహ్ణకాలమునకు తెలుసుకొనుటకు ఆరోజు సూర్యోదయ సూర్యా స్తమయములను తెలుసుకొని దీని ప్రమాణమును తెలుసుకొనవలెను. ఏ తిథికి కావలెనో ఆ తిథి ఉన్నరోజున దినప్రమాణమును గ్రహించి ఆ దిన ప్రమాణమును 5 భాగములు చేయవలెను. అందు మొదటి కాలము ప్రాతః కాలమనియు 2వ కాలము సంగమ కాలమనియు 3వ కాలము మధ్యాహ్న కాలమనియు 4వ కాలము అపరాహ్ణకాలమనియు 5వ కాలము సాయంకాలమనియు అందురు. సూర్యోదయ గంటలు, నిమిషములో మొదటి కాలమును కలిపిన ప్రాతఃకాలమనియు రెండవ కాలమును కలిపిన సంగమ కాలమనియు తెలుసుకొనగలరు.

ధర్మశాస్త్ర కర్తలందరు ఈ అపరాహ్ణకాలమును 5 విధములుగా చెప్పి తిథి నిర్ణయించిరి. అది ఎట్లనగా.

1) ముందురోజు అపరాహ్ణకాలముననే తిథి ఉండి మరుసటిరోజు అపరాహ్ణ కాలమున తిథిలేని యెడల అపరాహ్ణ కాలములోనున్న ముందు రోజుననే ఆబ్దికము పెట్టవలయును.
2) ముందు రోజు అపరాహ్ణకాలముననే తిథి లేక మరుసటి అపరాహ్ణ కాలములోనే తిథియున్నచో మరుసటిరోజు అపరాహ్ణమున ఆబ్దికము పెట్టవలయును.
3) ముందురోజు అపరాహ్ణములోను, మరుసటిరోజు అపరాహ్ణములోను తిథి పూర్తిగా నున్నచో మరుసటి దినమందే ఆబ్దికము పెట్టవలయును.
4) ముందురోజు అపరాహ్ణములో, మరుసటిరోజు అపరాహ్ణము కాలములోను తిథి సమానముగ నున్నచో మరుసటిరోజుననే ఆబ్దికము పెట్టవలయును.
5) ముందురోజు, మరుసటిరోజు అపరాహ్ణములలో తిథి ఎక్కువ, తక్కువలుగా నున్నప్పుడు ఏ రోజు ఆ తిథి ఎక్కువయున్నదో ఆ రోజుననే ఆబ్దికము పెట్టవలయును.

### మంచిమాట



"రామంస్కంధం హనూమంతం వైనతేయం వృకోదరం,
శయనే యః పఠేన్నిత్యం దుస్స్వప్నం తస్యనశ్యతి"
**శ్లోకం పఠిస్తూ నిదురకు ఉపక్రమిస్తే దుస్స్వప్నములు రావు**

◆ శ్రీ మూర్తి వారి శోభకృత్ నామ సంవత్సర గంటల పంచాంగము ◆

# గర్భిణి, శిశు ముహూర్త విషయములు



**గర్భాధానం :** అశ్వని, భరణి, ఆశ్రేష, మఘ, మూల, జ్యేష్ఠ, రేవతి నక్షత్రములు పూర్తి నిషేధము. జన్మ, నైధన, తారలు కాకూడదు. ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, మృగశిర, హస్త, అనూరాధ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రోహిణి, స్వాతి నక్షత్రములు విశేషములు. రెండు పక్షము లలోని షష్ఠి, అనధ్యయన దినములు, ఏకాదశులు, ఆది మంగళ వారములు, సంక్రమణ దినములు. శ్రాద్ధ దినములు గర్భాధానముకు నిషేధ దినములు. వివాహం అయిన 16 రోజుల లోపు గర్భాధానముకు ముహూర్తము చూడనవసరం లేదు అనునది అశాస్త్రీయ విషయం. భార్యాభర్తల భవిష్య ఆరోగ్య విషయాలలో గర్భాధాన ముహూర్తం ముఖ్య భూమిక వహిస్తుంది. వ్రతములు ఆచరించు దినములలో సంగమం నిషేధము.



**పుంసవనం :** గర్భం నిర్దిష్టంగా తెలిసిన తర్వాత రెండవ మాసంలో కానీ, మూడవ మాసంలో కానీ చేయవలెను. ఇది ప్రతి గర్భధారణ యందు గర్భశుద్ధి కొరకు చేయుదురు. చవితి, నవమి, చతుర్దశి తిథులు కాకుండాను; సోమ, బుధ, గురు, శుక్రవారముల యందును; అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి అనూరాధ, మూల ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు పుంసవన కార్యము చేయవలెను.



**సీమంతం :** పుంసవనముకు చెప్పబడిన తిథి వార నక్షత్రములు సీమంతముకు కూడా కావలెను. ప్రథమ గర్భధారణ విషయంలో నాలుగు, ఆరు, ఎనిమిది మాసములలో చేయుట శాస్త్రము. అయితే అయిదు, ఏడు, తొమ్మిది మాసములలో చేయుట ఆచారము. పుంసవనముకు అష్టమశుద్ధి కావలెను. సీమంతముకు అష్టమ నవమ శుద్ధులు రెండూ కావలెను. సీమంతం అనివార్య కార్యముల వలన చేయలేనిచో ప్రాయశ్చిత్తముగా గోదానము చేయవలెను.

**సూచన :** సీమంత, పుంసవములు రెండూ మధ్యాహ్న 12 గం. దాటిన తర్వాత చేయుట అశాస్త్రీయమైన పని. అయితే ప్రస్తుత సమాజంలో చేయుచున్నారు.

**గర్భిణీపతి ధర్మాలు :** భార్య గర్భవతిగా ఉన్నప్పుడు "గర్భిణీ వాంఛితం ధర్మం తస్యై దద్యాత్ యథోచితం". భార్య కోరిన ఉచితమయిన కోరికలు తీర్చవలెను. విదేశీ ప్రయాణము, చెట్లు





నరుకుట, ఏడవ మాసము నుండి క్షౌరము, మైథునము, తీర్థయాత్ర, శ్రాద్ధభోజనము, నావ ప్రయాణము, వాస్తుకర్మలు, ప్రేతకర్మ నిషేధము. గర్భిణీపతి స్వపితృకర్మలు చేయవచ్చును.



**జాతకర్మ :** ప్రసవం అయిన పదకొండవరోజు నుండి బేసి రోజులలో మొదటి నెలలో జాతకర్మ చేయు విషయమై ముహూర్తం చూడనవసరం లేదని ఆంధ్రలో బాగా ఆచారంలో ఉన్నది. అష్టమి, చవితి, చతుర్దశి, అమావాస్య, షష్ఠి వంటి తిథులు కాకుండాను, మంగళ, శని, వారములు కాకుండాను అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనురాధ, ఉషా, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉ.భా, రేవతి ఈ నక్షత్రము లందు జాతకర్మ ఆచరించవలెను. జాతకర్మ మధ్యాహ్నం 12.00 లోపల చేయవలెను.

**జనన దుష్టకాలములు దానికి శాంతి విషయములు :** బహుళ చతుర్దశినాడు జననమయిన ఎడల ఆ చతుర్దశి ప్రమాణమును ఆరు భాగములు చేసి అందు మొదటి భాగమును విడిచి మిగిలిన అయిదు భాగములలో జననమయినచో శాంతి చేయవలెను. ద్వితీయ భాగంలో జననం తండ్రికి, తృతీయ భాగంలో జననము తల్లికి, చతుర్థ భాగంలో జననము మేనమామకు, పంచమ భాగంలో జననము వంశమునకు, షష్ఠ భాగంలో జననము ధనముకు నష్టము కలుగును. ఇందు చతుర్దశి రెండు మూడు ఆరవ భాగములలో జననమయిన గోముఖ ప్రసవశాంతి పూర్వకంగా చతుర్దశి శాంతి చేయవలెను. మిగిలిన భాగములలో జననమయిన కేవలం చతుర్దశి శాంతిమాత్రము చేయవలెను.



అమావాస్య నాడు జననమయినచో చతుర్దశీ జననశాంతి వలెనే అమావాస్య జననశాంతి కూడా చేయవలెను. అమావాస్య జననమయిన వానికి వెంటనే శాంతి చేసి గ్రహించుట శ్రేయస్కరము. కుహూ అమావాస్య జనన ఫలం ధననాశనం. దర్శ జనన ఫలం తల్లిదండ్రులకు అరిష్టం.

వ్యతీపాత, వైధృతి యోగముల దినముల యందును జననము అయినచో గ్రహముఖమును గోముఖ ప్రసవ శాంతియు చేయవలెను.

తల్లియొక్క తండ్రి యొక్క తనకు ముందుగా పుట్టిన సోదరుల యొక్క నక్షత్రము నందు జననం అయినచో ఏకనక్షత్ర జననశాంతి చేయవలెను.

గ్రహణ సమయంలో జననమయిన ఆ శిశువు బ్రతుకుట కష్టము. ఒకవేళ బ్రతికినను రోగములు, దరిద్రముతో జీవించును. కావున గ్రహణ సమయములో జనించినను శాంతి

చేయవలెను. నక్షత్ర గండములు ఏవనగా రేవతి అశ్వినీలు, ఆశ్రేష మఘలు, జ్యేష్ఠ మూల నక్షత్రముల యొక్క ఆంత్య ప్రారంభ రెండేసి ఘడియలను కలిపి నక్షత్ర గండము అంటారు. అలాగే పంచమీ షష్ఠిల సంధిలోని రెండు ఘడియలు దశమి ఏకాదశిలకు, పూర్ణిమ ప్రతిపత్తులకు సంధిలో ఉండే రెండు ఘడియలను తిథి గండము అంటారు. నక్షత్ర గండం తల్లికి, తిథి గండము తండ్రికి చెడు ఫలములను అందచేయును. "విషనాడీషు సంజాతః పితృమాతృ ధనాత్మనాం" వర్జ్య సమయంలో జనించిన ఎడల తల్లిదండ్రులకు, ధనమునకు తనకు కూడ దోషము కలుగును. అందువలన విష ఘటికా మంత్రము జపం చేయించి తచ్ఛాంతి చేయవలెను.

కవల పిల్లలు జనించిన యమళ జనన శాంతి ప్రేగు మెడ చుట్టుకొని జనన మయిన నాళవేష్టన శాంతి యిలా జనన సమయానికి సంబంధించిన శాంతులు అనేకం కలవు. వాటికి తగు రీతులలో శాంతిని తెలుసుకొని శాంతి చేయించవలెను.

"నాళ వేష్ఠన జాతస్య పితుర్భ్రాతుశ్చ మాతులః" ప్రేగు మెడలో వేసుకొని జనించినచో తండ్రికి, సోదరునికి, మేనమామకు దోషం అగును.

**బాలారిష్టములు :** చంద్రాష్టమంచ ధరణీసుత స్సప్తమంచ రాహూ ర్నవంచ శని జన్మ గురు స్తృతీయే అర్కస్తు పంచ భృగుషట్క బుధ శ్చతుర్ధే కేతోవ్యయో స్తు బాలారిష్టానాం.

చంద్రుడు జన్మలగ్నమునకు ఎనిమిదవ యింట ఉన్నా, కుజుడు ఏడవ యింట ఉన్నా, రాహువు తొమ్మిదవ యింట ఉన్నా, శని లగ్నములో ఉన్నా, గురువు తృతీయంలో ఉన్నా, రవి పంచమంలో ఉన్నా, శుక్రుడు ఆరవయింట ఉన్నా, బుధుడు నాల్గవ యింట ఉన్నా, కేతువు వ్యయంలో ఉన్నా బాలారిష్టములుగాను, ఆయాగ్రహములకు జపదాన హోమములు మొదటి నెలలోనే చేయించాలి.

జననకాలమునకు అష్టమాధిపతి దశ అయినచో బాలారిష్టము అగును. జన్మలగ్నములో షష్ఠాధిపతి ఉన్నా, భాగ్యాధిపతి అష్టమ వ్యయములలో ఉన్నా జన్మలగ్నాత్ చతుర్థాధిపతి వ్యయంలో ఉన్నా బలారిష్టమే. జననకాల దశానాధుడు షష్ఠాధిపతి కలిసి ఉన్నా జననకాల దశనాధుడు వ్యయాధిపతి కలిసిఉన్నా బాలారిష్టం అగును. కావున వీటికి శాంతి చేయవలెను. జననకాలమునకు షష్ఠాధిపతి దశకానీ, అంతర్దశ కానీ అయినచో అనారోగ్య ప్రాప్తి అధికంగా ఉండును. అష్టమస్థానంలో వ్యయాధిపతి ఉండి ఆ వ్యయాధిపతి అంతర్దశ కానీ మహాదశ కానీ ఉన్న ఎడల ఆ గ్రహములకు శాంతి చేయవలెను.

తల్లి, తండ్రుల, సోదరుల నక్షత్రంలో జననం అయినచో ఏకనక్షత్ర జనన శాంతి చేయవలెను. కవలలు పుట్టిన యమళ జనన శాంతి, పేగు మెడలో వేసుకుని పుట్టిన నాళవేష్టన జననశాంతి, విషఘడియ మరియు దుష్టతిధి వార నక్షత్రములలో పుట్టిన గ్రహణంలో పుట్టిన గోముఖ ప్రసవ శాంతి చేయాలి.

**నామకరణం :** జాతకర్మకు వాడు నక్షత్రములు, తిథులు, వారములు అన్నియు నామ కరణముకు కూడా ఉపయోగించును. మగపిల్లలకు సరిసంఖ్య అక్షరములతోను, ఆడపిల్లలకు





బేసిసంఖ్య అక్షర ములతోను నామకరణ చేయవలెను. నామకరణం జాతకర్మ రెండును మధ్యాహ్నం 12 గం. లోపల చేయవలెను. లగ్నము నుండి వ్యయస్థానంలో ఏ గ్రహము లేని ముహూర్తం నిర్ణయించవలెను. అలాగే అష్టమ శుద్ధి విశే షము. నామము, దైవ సంబంధం, మాస సంబంధం ఉండునట్లు ఉంచుట మంచిది. అర్థం లేని పేరు పెట్టుట వలన దోషము.





**ఊయలలో వేయుట :** మంగళ శనివారములు పనికి రాదు. అష్టమి, ద్వాదశి, షష్ఠి, నవమి, అమావాస్య తిథులు పనికిరాదు. బారసాల రోజున అయినట్లయితే ఆ రోజు సాయంత్రం వర్జ్య దుర్మమూర్తములు విడిచి ఊయలలో నూతనంగా శిశువును ఉంచవచ్చు. భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, మఘ, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, పూ.షా, పూ.భా నక్షత్రములు పనికిరావు.

**నూతన వస్త్రధారణ :** ఆది, మంగళ శని వారములు నూతన వస్త్రధారణ చేయకూడదు. అలాగనే అష్టమి, షష్ఠి, ద్వాదశి, నవమి, అమావాస్య తిథుల యందు నూతన వస్త్రధారణ పనికిరాదు. భరణి, కృత్తిక, ఆర్ద్ర ఆశ్రేష, మఘ, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్రలలో నూతన వస్త్రధారణ చేయుట మంచిదికాదు. అయితే నిత్యంలో పండుగల రోజులలోను వస్త్రధారణ చేయుటకు వర్జ్య దుర్మహూర్తములు లేని సమయంలో చేయవచ్చు. అంతేకాకుండా నూతన వస్త్రములకు మంగళకరమయిన పసుపును పెట్టి ధరించవలెను.





**జలపూజ :** బుధ, గురు, శుక్ర, సోమ వారము లందును శ్రవణం, పుష్యమి, పునర్వసు, మృగశిర, హస్త, మూలా, అనూరాధలలో ఒక నక్షత్రమందును, శుభతిథులయందు ప్రసవించిన స్త్రీ జలసమీపము నకు వెళ్ళి జలపూజ చేయ వలెను. దీనిని ప్రస్తుతం అందరూ ఆచరిస్తూనే ఉన్నారు. అయితే వీటికి చైత్ర, పుష్య మాసములు, మూఢమి, అధిక మాసములు వర్జ్యము.

**నిష్క్రమణం :** నిష్క్రమణం అనగా శిశువును భూమి యందు కూర్చొండబెట్టుట అని కొందరు- గృహాంతరమునకు గానీ, గ్రామంతరమునకు గానీ మొదటిసారిగా శిశువును తీసుకువెళ్ళుట అని మరికొందరు చెప్పి యున్నారు. శుభతిథుల యందు బుధ, గురు, శుక్ర వారముల యందును చేయవలెను. దీనిని అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తరాత్రయం,

శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, హస్త, అనురాధ, రేవతి నక్షత్రములు ప్రశస్తములు. అందుకే హాస్పిటల్ నుండి మంచి ముహూర్తమునకు ఇంటికి తీసుకురావాలి.



**అన్నప్రాశన :** ఆరవమాసం లగాయితు మగపిల్లల విషయంలో సరిమాసముల యందును. అయిదవ మాసం మొదలు బేసి మాసముల యందు ఆడపిల్లల విషయంలో అన్నప్రాశన చేయవలెను. ఆరవనెల ఆరవరోజు అనేది చెడు సంస్కార విషయము. అది దుష్టాచారము. అన్న ప్రాశనతోనే పిల్లల ఆరోగ్య విషయాలు ఉంటాయి. అందువలన మంచి ముహూర్తానికే అన్నప్రాశన చేయాలి. అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనురాధ, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రములందు చేయవలెను. ఆది, శని, మంగళవారములు నిషేధం. జన్మలగ్నం, అష్టమలగ్నం కాకుండాను, దశమస్థాన శుద్ధి ఉన్న లగ్నమున అన్నప్రాశన చేయవలెను.



**చెవులు కుట్టుట :** పుట్టిన పన్నెండవ, పదహారవ రోజునను లేక ఆరు, ఏడు, ఎనిమిది నెలలయందైనను పూర్వాహ్న, మధ్యాహ్న కాలములలో సోమ, బుధ, గురు, శుక్ర వారములలోను, శ్రవణం, ఆర్ద్ర, హస్త, చిత్త, మృగశిర, రేవతి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, పునర్వసు, ధనిష్ఠలయందు కుంభ, వృశ్చిక, సింహ లగ్నములు కాకుండా, అష్టమశుద్ధితో కూడిన లగ్నమునందు చెవులు కుట్టుటకు శ్రేష్ఠము.



**క్షౌరం + పుట్టు వెంట్రుకలు :** షష్ఠి, అష్టమి, చవితి, చతుర్దశి, అమావాస్య, ద్వాదశి, పాడ్యమి, నవమి తిధులు పనికిరావు. శుక్ర, మంగళ, శని వారములు కూడదు. పుష్య, పునర్వసు, రేవతి, హస్త, శ్రవణ, ధనిష్ఠ, మృగశిర, అశ్విని, చిత్త, శతభిషం, స్వాతి ఇవి ప్రశస్తము. ఉత్తర, తూర్పు దిశగా కూర్చుని క్షౌరం చేయించుకోవాలి. నిత్యంలో సోమ, బుధవార విషయంలో తిధి నక్షత్ర పట్టింపు లేదు.



**అక్షరాభ్యాసం :** ఉత్తరాయణం శ్రేష్ఠము. హస్త, పునర్వసు, స్వాతి, అనురాధ, ఆర్ద్ర, రేవతి, అశ్వని, చిత్త, శ్రవణముల యందు, ఆది, మంగళ, శనివారములు కాకుండాను, చరరాశి లగ్నము లందు రిక్త తిధులు షష్ఠి, అష్టమి విడిచి అనధ్యయన దినములు కాకుండాను, అష్టమశుద్ధి కలిగిన లగ్నమునందు అక్షరాభ్యాసం చేయవలెను. కేవలం మధ్యాహ్నం లోపుగా ఉన్న లగ్నముల యందు మాత్రమే అక్షరాభ్యాసం చేయవలెను. నాల్గవ సంవత్సరం అక్షరభ్యాసం నిషేధం కాదు.





# ఉపనయన ముహూర్త విషయములు



గర్భాష్టమంలోను, 16వ సంవత్సరంలోను కాల ప్రాధాన్యం, కాలాతీతం దృష్ట్యా ముహూర్త బలం లేకపోయినను ఉపనయనము చేయవలెను. 16 దాటిన బ్రాహ్మణునికి ఉపనయనం శ్రేష్ఠం కాదు. 22 దాటిన క్షత్రియులకు, 24 దాటిన వైశ్యులకు ఉప నయనం వివాహం కోసమే కానీ సంస్కారం కోసం కాదు. సరి, బేసి సంవత్సరాలలో ఉపనయనం విషయంలో శాస్త్ర నిషేధం లేదు. వివాహం రోజు ఉపనయనం దౌర్భాగ్యమే.

**ఉపనయన కర్తల నిర్ణయం :** "పితైవోపనయే త్పుత్రం తదభావే పితుః పితా; తదభావే పితుర్భ్రాతా, తదభావేతు సోదర; తదభావే సగోత్ర సపిండాః, తదభావేన సపిండ సగోత్రజాః"

ఉపనయనము చేయుటకు తండ్రి ముఖ్యాధికారి. వారులేని ఎడల పితా మహుడు (తాత). వారు లేని ఎడల తండ్రి సోదరుడు (పినతండ్రి, పెదతండ్రి). వారు లేని ఎడల సోదరుడు, వారు లేని ఎడల ముగ్గురు పురుషులలో ఉన్న జ్ఞాతులు. వారు లేని ఎడల మేనమామ మొదలగు సపిండులు. వారు లేనిచే దూరపు జ్ఞాతులగు సగోత్రులు ఉపనయనము చేయుటకు అధికారులు. వీరిలో ఎవరూ లేని ఎడల శ్రోత్రీయుడైన వానిచేత బ్రహ్మోపదేశ సంస్కారం పూర్తి చేయవలెను. ఉపనయనము చేయువారు వటువు కంటే తప్పనిసరిగా పెద్దవారై ఉండాలి.

**ఉపనయనమునకు కాలములు :** "వసంతే బ్రాహ్మణ యుపనయీత గ్రీష్మే రాజన్యం శరదివైశ్యం మాఘాది శుక్రాంత పంచమాసావా సాధారణా స్సకల ద్విజానాం" అనగా వసంత ఋతువు బ్రాహ్మణులకును, గ్రీష్మ ఋతువు క్షత్రి యులకును, శరదృతువు వైశ్యులకును ఉపనయన విషయమై విశేషము. అయితే వసంతము అని వాడిన కారణంగా ఉత్తరాయణమునందును ఉపనయనము చేయుటకు సంకోచము లేదు. అయితే మాఘాది పంచమాసములు విశేషంగా చెప్పిన కారణంగా మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ మాసములందు ఉపనయనము చేయు విషయమై ఆక్షేపణ అనవసరం. అయితే ప్రత్యేకించి మాఘాది పంచ మాసాః అని విధించిన కారణంగా పుష్యమాసం, ఆషాఢమాసం, ఉత్తరాయణంతో కూడుకున్నవి అయినప్పటికి ఆ మాసములలో ఉపనయన వ్రతం చేయరాదు.

తదియ, పంచమి, షష్ఠి, సప్తమి తిధులు విశేషము. బుధ, గురు, శుక్ర వారములు విశేషము. అనురాధ, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రేవతి, ఉత్తర, ఉత్తరాభాద్ర, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, అశ్వని నక్షత్రములు విశేషములు. అష్టమంలోను, కేంద్ర స్థానములైన 1,4,7,10 స్థానములందును, పాపగ్రహములు లేకుండా చూచి ఉపనయనం చేయవలెను. రవి వ్యయమందు ఉండగా ఉపనయనం చేయకూడదు. కేవలం ఉపనయనం చేయడం కాదు గాయత్రీ మంత్రాన్ని నిత్యం పఠిస్తే సత్ఫలితాలు ఎక్కువ అందుతాయి.

# వధూవరుల జాతకంలో పరిశీలించవలసిన విషయములు

**కుజదోష విచారణ :**



**పాతాళేపి ధనౌరంధ్రే జామిత్రే చాష్టమేకు జే**
**స్థితః కుజః పతింహంతి నచేచ్ఛు భయుతేక్షితః**
**ఇందోరవ్యక్త గేహేషు స్థితః భౌమోధవాశనిః**
**పతిహంతాస్త్రియాశ్చైవం వరస్య యది స్త్రీ మృతిః**(బృహత్పరాశరీరాశాస్త్రం)

జన్మలగ్నము - చంద్రలగ్నముల లగాయితు 2,4,7,8,12 రాశుల యందు కుజుడు ఉన్న ఎడల దానిని కుజదోషంగా పరిగణించాలి. ఈ కుజదోషం యిరువురికీ ఉన్ననూ లేదా ఇరువురికీ దోషం లేకున్ననూ వివాహం చేయవచ్చును. ఈ దోషం ఒకరికి వుండి మరొకరికి లేని ఎడల వైవాహిక జీవితం కలహప్రదంగా ఉంటుంది. కుజుడు కలహప్రదుడు. శని ఆయుర్దాయ కారకుడు కావున పైన చెప్పిన విధానం లోనే శనిదోషం కూడా చూడవలెను అని పరాశర మతం. "నచేచ్ఛభయుతేక్షితః" అని ఉన్న కారణంగా కుజునికి శుభగ్రహముల కలయిక (లేదా) శుభగ్రహ వీక్షణ ఉన్నచో దోషం ఉండదు. కేవలం ఆడవారి జాతకంలో దోషం ఉంటే మగవారికి ఇబ్బంది. కేవలం మగవారి జాతకంలో ఉంటే ఆడవారికి ఇబ్బంది.

ద్వితీయే భౌమదోషస్తు యుగ్మ కన్యక యోర్వినా । ద్వాదశే భౌమ దోషస్తు వృషతాళిక యోర్వినా । చతుర్ధే భౌమదోషస్తు మేష వృశ్చికయోర్వినా । సప్తమే భౌమదోషస్తు నక్రకర్కట యోర్వినా । అష్టమే భౌమదోషస్తు ధనుర్మీనద్వయం వినా । కుంభేసిం హేన దోషస్స్యాత్ ప్రత్యక్షం దేవ కేరళే ॥

ద్వితీయ స్థితి కుజదోషం మిధున కన్యకలకు లేదు. ద్వాదశ స్థితి కుజదోషం వృషభ తులలకు లేదు. చతుర్ధస్థితి కుజదోషం మేషవృశ్చికములకు లేదు. సప్తమస్థితి కుజదోషం మకర కర్కాటకములకు లేదు. అష్టమ స్థితి కుజదోషం ధనస్సు, మీనములకు లేదు. కుంభము, సింహముల యందు జననమయినచో కుజదోషం ఉండదు. మేష, వృశ్చిక, మకర లగ్నముల విషయంలోను మృగశిర ధనిష్ఠ, చిత్త నక్షత్రముల విషయంలోను కుజదోషం ఉండదు. నిత్యం సుబ్రహ్మణ్య ఆరాధన కుజగ్రహ స్తోత్ర పారాయణ చేయువారు కుజగ్రహ దోషం తగ్గించుకోగలుగుతారు.

చంద్ర మంగళ (కుజ) సంయోగం / గురు మంగళ సంయోగం కుజదోషం యివ్వదు. లగ్నం శరీరం, చంద్రుడు మనస్సు, శుక్రుడు భోగకారకుడు కావున ఈ మూడింటినుండి కుజుడుగా చూడాలి. ఒకవేళ వివాహ సమయానికి కుజదశ వెళ్ళిపోతే కుజదోషం ప్రభావం ఉండదు. కుజుడు నీచలో ఉంటే ప్రభావం తక్కువ. కుజుడు దోషంగా ఉంటే పెళ్ళికాకుండా చేయడు. పెళ్ళి అయిన తర్వాత ఇబ్బంది పెడతాడు. కలహకారుడు కుడుజు కళత్రకారుడు శుక్రుడు ఒకే నక్షత్రపాదం (అయిదు డిగ్రీల)లోపు కలిస్తే మహాదోషం. కేవలం పాయింట్ల పట్టిక ఆధారం కూడదు. క్రింది విషయాలను బాగా పరిశీలించండి. పాయింట్ల పట్టిక మరియు కేవలం నక్షత్రం ఆధారంగా సంబంధాలకు ప్రాథమిక విచారణ చేయుట తప్పు. జాతక విషయంగా వెళితే మొత్తం అన్ని వివరాలు తెలుసుకొని ముందుకు వెళ్ళండి.





**నక్షత్ర విచారణ :** జన్మ నక్షత్రములు తీసుకున్న తర్వాత వాటి ద్వారా గ్రహమైత్రి, గణకూటమి, యోనికూటమి, రాశికూటమి, స్త్రీ దీర్ఘము, నాడీకూటమి ముఖ్యంగా పరిశీలించాలి. ఇవి ఆరు కూటములు. మహేంద్రకూటమి, వశ్యకూటమి, దినకూటమి, వేధాకూటమి, రజ్జుకూటమి, వర్ణకూటమి. ఇవి ఆరు కూటములు సామాన్య కూటములు. ఈ పన్నెండు కూటములను కలిపి ద్వాదశవర్గులు అంటారు. అందు ముఖ్య ఆరు వర్గులను సూక్ష్మంగా పరిశీలించగా

**గ్రహమైత్రి :** నక్షత్రవిశేషములు అనే పట్టికలోని ఆయా నక్షత్రములకు సంబం ధించిన రాశ్యాధిపతుల వివరాలు ప్రకారం ఈ క్రింది పట్టికలోని విషయం గమనించాలి. పరస్పర శత్రుగ్రహ ఆధిపత్య రాశులకు వివాహం కూడదు.

| గ్రహం | శతృగ్రహం | మిత్రగ్రహం | సమగ్రహం | రాశి |
|---|---|---|---|---|
| రవి | శుక్ర,శని | చంద్ర,కుజ,గురు | బుధుడు | సింహం |
| చంద్ర | – | రవి,బుధ | కుజ,గురు,శుక్ర,శని | కర్కాటకం |
| కుజ | బుధ | రవి,చంద్ర,గురు | శుక్ర,శని | మేష,వృశ్చిక |
| బుధ | చంద్ర | రవి,శుక్ర | కుజ,గురు,శని | మిథున,కన్య |
| గురు | బుధ,శుక్ర | రవి,చంద్ర,కుజ | శని | ధనస్సు,మీనం |
| శుక్ర | రవి,చంద్ర | బుధ,శని | కుజ,గురు | వృషభం,తుల |
| శని | రవి,చంద్ర,కుజ | బుధ,శుక్ర | గురు | మకర కుంభం |

**స్త్రీ దీర్ఘము :** వధూనక్షత్రం నుండి వరుని నక్షత్రం లెక్కింపగా 9 నక్షత్రముల లోపు ఉన్న ఎడల అధమము. 9 తర్వాత 18 లోపల ఉన్న మధ్యమము. 18 తర్వాత 27 లోపల ఉన్న ఉత్తమము.

**గణకూటమి :** వివాహ విశేషాః పట్టికలో చూపిన ప్రకారం వధూవర నక్షత్రములు పరస్పరం దేవరాక్షస గణములు అయిన అధమము. మనుష్య రాక్షస గుణముల విషయంలో గ్రహమైత్రి కుదిరిన స్వీకరించవచ్చు. దేవ-దేవ; దేవ-మనుష్య; మనుష్య-మనుష్య; రాక్షస-రాక్షస విశేషములు.

**యోని కూటమి :** పట్టికలో చూపిన నక్షత్ర జంతువులకు పరప్పర శతృత్వం ఉన్నటువంటి గో-వ్యాఘ్రములు, అశ్వ-మహిషములు; గజ-సింహములు, కుక్క-లేడి; పాము-ముంగిస; కపి-ఎనుములు, మార్జాల-మూషికములు పరస్పర శత్రుత్వ జంతువులు క్వావున అవికాక మిగిలిన నక్షత్రములు స్వీకరించాలి.

**నాడీకూటమి :** వధూవర నక్షత్రములు ఇరువురివీ ఒకే నాడీ నక్షత్రములు కాకూడదు. వేరువేరు నాడులు అయిన ఎడల విశేషము. నాడీ వివరములు పట్టికలో ఉన్నవి. పట్టికలో యిచ్చినవి త్రినాడీ స్వరూపము.

**రాశికూటమి :** అమ్మాయి రాశి లగాయితు అబ్బాయి రాశి రెండు, మూడు, నాలుగు, అయిదోది. ఆరు రాశులు కాకపోయినచో శుభము.

**గ్రహమైత్రి కుదిరినప్పుడు రాశికూటమి, నాడీకూటమి,**
**స్త్రీ దీర్ఘములు కుదరకపోయిననూ దోషం వుండదు.**

**గండనక్షత్ర విషయం :** ఆశ్రేషా, మూల, విశాఖ, జ్యేష్ఠ నక్షత్రములలో జనించిన స్త్రీ విషయంలో వివాహ పొంతనలు చూసేటప్పుడు గండనక్షత్రములుగా పరిగణిస్తారు. అయితే అందులో ఆశ్రేషా 4వ పాదము, మూల 1 పాదము, విశాఖ నాల్గవ పాదము, జ్యేష్ఠ 4వ పాదము మాత్రమే దోషము గండరక్ష జనన దోషాన్ని పరిశీలించిన మీదట ఆశ్రేషా, జ్యేష్ఠ నక్షత్రములు చివరి నాలుగు ఘడియల కాలం మాత్రమే దోషమని మూల 1వ పాదంలో ప్రారంభంలో ప్రారంభ నాలుగు ఘడియల కాలమే దోషం అని తోచుచున్నది. విశాఖ నక్షత్రం నాల్గవపాదం వధువును ఇంటిలో కనిష్ఠ వరునికి, జ్యేష్ఠా నక్షత్రం వధువును ఇంటిలో జ్యేష్ఠవరునికి ఇవ్వవలెను.

బ్రాహ్మణులకు గ్రహమైత్రి, క్షత్రియులకు గణకూటమి, వైశ్యులకు స్త్రీదీర్ఘం, శూద్రులకు జంతువులు కుదిరితే మిగిలినవి కుదరకపోయినా ఫరవాలేదు.

**త్రిజ్యేష్ఠ స్వరూపం :** "అద్యగర్భప్రసూతాయాః కన్యకాయా వరస్యచ; జ్యేష్ఠమాసే నకుర్వీత కదాచిదపి మంగళమ్". ప్రథమ గర్భంలో జన్మించిన వధూవరుల విషయంలో జ్యేష్ఠమాసంలో మాత్రం వివాహం చేస్తే త్రిజ్యేష్ఠ అవుతుంది. అలాగే వధూవరులలో ఒకరు జ్యేష్ఠా నక్షత్రంలో జనించి మరొకరు జ్యేష్ఠులయితే వారికి జ్యేష్ఠమాసంలో మాత్రం వివాహం చేయకూడదు. మిగిలిన మాసముల చేయుటకు అభ్యంతరం లేదు. ఎటువంటి త్రిజ్యేష్ఠా స్వరూపం అయినా జ్యేష్ఠమాసంలో మాత్రమే వివాహం నిషేధం. మిగిలిన మాసములలో దోషం లేదు.

**ఏకనక్షత్ర వివాహ విషయము :** రోహిణి, ఆర్ద్ర, పుష్యమి, మఘ, విశాఖ, శ్రవణం, ఉత్తరాభాద్ర, రేవతి ఈ ఎనిమిది నక్షత్రముల విషయంలో వధూవరులకు ఏకనక్షత్రమయిన దోషం లేదు. అశ్వని, భరణి, ఆశ్రేషా, పుబ్బా, స్వాతి, మూల, శతభిషం యివి మధ్యమములు. తక్కిన నక్షత్రములు దోషము. అయితే 27 నక్షత్రములలోను కూడా ఒకే నక్షత్రం అయినప్పటికీ భిన్న పాదముల అయినచో దోషం లేదు.

## వివాహ విషయంలో జాతకం - పరిశీలన అంశాలు

1. కుటుంబస్థానం : అధిపతి బలంగా ఉన్నారా? లేదా? కుటుంబస్థానం పాప గ్రహాలతో ఉన్నదా? లేదా?
2. సంతానస్థానం : సంతానస్థానం కూడా కుటుంబ స్థానం మాదిరిగానే పరిశీలించాలి.
3. ఆడవారి జాతకంలో భాగ్యస్థానం ఒకటి బాగా ఉంటే మిగతా పదకొండు స్థానాలు బాగాలేకపోయినా మంచి జాతకంగానే గుర్తించాలి.
4. వధూవరుల జాతకంలో రాహువు లగ్నం, ద్వితీయం, పంచమం, సప్తమం, అష్టమంలలో ఏ ఒక్క స్థానంలో ఉన్ననూ ఇరువురుకీ వివాహం చేయకూడదు.
5. గురు, రాహువులు - శుక్ర, రాహువులు - రవి, శుక్రులు - చంద్ర, రాహువులు - కుజ, శుక్రులు మధ్య ఐదు డిగ్రీల వ్యవధి కంటే తక్కువగా ఉంటే ఆ జాతకంలో ఏదో రకమైన సమస్య ఉంటుంది. అందువలన బాగా పరిశీలించాలి.
6. ఆడవారి జాతకంలో అష్టమ స్థానం (సౌభాగ్య స్థానం)లో ఉన్న పాపగ్రహం నవాంశలో ఎవరి ఇంట్లో ఉంటుందో ఆ నవాంశనాథుని దశ వచ్చినప్పుడు వైధవ్యం వస్తుంది.
7. ఆయుర్విచారణ లేకుండా వధూవరుల జాతకాలు చూడరాదు.
8. రోగస్థానాధిపతి లగ్నంలో ఉన్ననూ, లగ్నాధిపతి రోగ స్థానంలో ఉన్ననూ - (అలాగే ద్వితీయ వ్యయాధిపతుల విషయం సప్తమ వ్యయాధిపతుల విషయం) బహు జాగ్రత్తలు తీసుకొని పరిశీలింపవలెను.





# వధూవర గణ సమ్మేళన చక్రం

## వరుని నక్షత్రం

| వధూ నక్షత్రము | అశ్విని | భరణి | కృత్తిక 1 | కృత్తిక 3 | రోహిణి | మృగ 2 | మృగ 2 | ఆర్ద్ర | పున 3 | పున 1 | పుష్యమి | ఆశ్లేష | మఖ | పుబ్బ | ఉ.ఫ.1 | ఉ.ఫ.3 | హస్త | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 28 | 33 | 28 | 18 | 21 | 22 | 26 | 17 | 18 | 22 | 31 | 27 | 21 | 26 | 17 | 11 | 09 | 13 |
| భరణి | 34 | 28 | 29 | 19 | 22 | 15 | 18 | 26 | 26 | 30 | 23 | 24 | 21 | 19 | 28 | 21 | 19 | 06 |
| కృత్తిక 1 | 27 | 27 | 28 | 17 | 09 | 15 | 19 | 20 | 21 | 25 | 26 | 23 | 17 | 21 | 22 | 15 | 15 | 18 |
| కృత్తిక 3 | 18 | 18 | 19 | 28 | 19 | 25 | 16 | 17 | 18 | 22 | 23 | 20 | 19 | 23 | 24 | 21 | 21 | 23 |
| రోహిణి | 23 | 23 | 10 | 19 | 28 | 36 | 27 | 23 | 23 | 27 | 26 | 13 | 12 | 26 | 28 | 25 | 26 | 20 |
| మృగ 2 | 23 | 13 | 15 | 27 | 34 | 28 | 20 | 25 | 23 | 26 | 19 | 22 | 21 | 17 | 25 | 23 | 27 | 13 |
| మృగ 2 | 27 | 18 | 21 | 18 | 25 | 20 | 28 | 33 | 31 | 19 | 10 | 15 | 24 | 20 | 28 | 30 | 34 | 21 |
| ఆర్ద్ర | 19 | 27 | 21 | 18 | 24 | 26 | 34 | 28 | 25 | 13 | 02 | 13 | 23 | 29 | 22 | 24 | 24 | 27 |
| పున 3 | 19 | 26 | 22 | 19 | 23 | 24 | 32 | 24 | 28 | 16 | 23 | 16 | 27 | 22 | 21 | 23 | 24 | 25 |
| పున 1 | 21 | 28 | 23 | 20 | 24 | 25 | 19 | 10 | 14 | 28 | 35 | 28 | 15 | 20 | 14 | 16 | 18 | 20 |
| పుష్యమి | 30 | 21 | 26 | 23 | 24 | 17 | 10 | 18 | 21 | 35 | 28 | 30 | 18 | 14 | 23 | 26 | 27 | 12 |
| ఆశ్లేష | 25 | 23 | 22 | 19 | 21 | 21 | 13 | 12 | 15 | 28 | 28 | 28 | 15 | 15 | 17 | 20 | 22 | 26 |
| మఖ | 21 | 21 | 17 | 18 | 11 | 19 | 22 | 22 | 21 | 16 | 18 | 16 | 28 | 30 | 26 | 16 | 16 | 32 |
| పుబ్బ | 27 | 19 | 21 | 22 | 25 | 17 | 20 | 28 | 27 | 22 | 16 | 16 | 30 | 28 | 34 | 24 | 22 | 08 |
| ఉ.ఫ.1 | 18 | 27 | 22 | 23 | 25 | 25 | 28 | 21 | 21 | 16 | 25 | 18 | 26 | 34 | 28 | 18 | 26 | 14 |
| ఉ.ఫ.3 | 13 | 21 | 16 | 21 | 25 | 23 | 30 | 23 | 23 | 19 | 28 | 21 | 17 | 25 | 19 | 28 | 25 | 24 |
| హస్త | 11 | 10 | 16 | 21 | 26 | 26 | 33 | 23 | 23 | 19 | 28 | 21 | 15 | 25 | 19 | 28 | 25 | 24 |
| చిత్త 2 | 13 | 06 | 19 | 25 | 25 | 12 | 19 | 26 | 24 | 20 | 12 | 26 | 23 | 09 | 15 | 24 | 27 | 28 |
| చిత్త 2 | 22 | 15 | 28 | 23 | 20 | 12 | 13 | 20 | 18 | 20 | 12 | 26 | 25 | 10 | 17 | 17 | 20 | 21 |
| స్వాతి | 27 | 29 | 17 | 12 | 16 | 27 | 27 | 26 | 26 | 28 | 28 | 15 | 13 | 25 | 25 | 25 | 27 | 21 |
| విశాఖ 3 | 22 | 22 | 20 | 15 | 10 | 18 | 19 | 21 | 21 | 22 | 21 | 19 | 17 | 19 | 18 | 17 | 18 | 27 |
| విశాఖ 1 | 16 | 16 | 14 | 19 | 14 | 22 | 13 | 14 | 14 | 19 | 18 | 15 | 21 | 23 | 21 | 13 | 19 | 28 |
| అనురాధ | 24 | 14 | 19 | 24 | 27 | 20 | 11 | 16 | 21 | 26 | 18 | 21 | 24 | 20 | 29 | 26 | 27 | 12 |
| జ్యేష్ఠ | 12 | 18 | 24 | 29 | 22 | 22 | 13 | 03 | 06 | 10 | 20 | 26 | 31 | 23 | 16 | 13 | 12 | 25 |
| మూల | 12 | 20 | 24 | 19 | 13 | 14 | 21 | 15 | 12 | 06 | 17 | 24 | 25 | 19 | 09 | 13 | 13 | 27 |
| పూ.షా | 27 | 20 | 19 | 13 | 20 | 12 | 18 | 26 | 26 | 23 | 13 | 17 | 21 | 19 | 27 | 27 | 26 | 11 |
| ఉ.షా.1 | 25 | 27 | 14 | 08 | 11 | 18 | 24 | 26 | 26 | 23 | 24 | 09 | 11 | 26 | 28 | 28 | 27 | 20 |
| ఉ.షా.3 | 28 | 29 | 16 | 14 | 17 | 22 | 20 | 22 | 22 | 22 | 28 | 13 | 06 | 22 | 23 | 26 | 25 | 17 |
| శ్రవణం | 27 | 26 | 13 | 10 | 17 | 26 | 23 | 21 | 23 | 28 | 26 | 15 | 17 | 18 | 20 | 23 | 25 | 18 |
| ధనిష్ఠ 2 | 20 | 10 | 26 | 23 | 20 | 12 | 08 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 05 | 12 | 16 | 18 | 16 |
| ధనిష్ఠ 2 | 20 | 11 | 26 | 30 | 27 | 19 | 10 | 19 | 19 | 14 | 15 | 20 | 25 | 11 | 19 | 17 | 21 | 18 |
| శతభిషం | 15 | 21 | 28 | 32 | 25 | 25 | 18 | 10 | 10 | 07 | 15 | 20 | 26 | 20 | 13 | 11 | 08 | 26 |
| పూ.భా.3 | 18 | 25 | 20 | 24 | 31 | 31 | 24 | 17 | 17 | 22 | 13 | 28 | 18 | 05 | 12 | 16 | 18 | 16 |
| పూ.భా.1 | 14 | 21 | 16 | 19 | 26 | 26 | 25 | 18 | 18 | 18 | 25 | 18 | 16 | 22 | 14 | 16 | 18 | 19 |
| ఉ.భా. | 24 | 15 | 18 | 21 | 25 | 17 | 16 | 25 | 27 | 26 | 19 | 20 | 17 | 15 | 25 | 27 | 26 | 09 |
| రేవతి | 25 | 24 | 11 | 14 | 17 | 26 | 25 | 24 | 25 | 24 | 27 | 13 | 12 | 22 | 22 | 24 | 26 | 20 |

# వధూవర గణ సమ్మేళన చక్రం

వరుని నక్షత్రం

| వధూ నక్షత్రము | చిత్త2 | స్వాతి | విశాఖ 3 | విశాఖ1 | అనురాధ | జ్యేష్ఠ | మూల | పూ.షా | ఉ.షా.1 | ఉ.షా.3 | శ్రవణం | ధనిష్ఠ2 | ధనిష్ఠ2 | శతభిషం | పూ.భా.3 | పూ.భా.1 | ఉ.భా | రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 22 | 26 | 22 | 19 | 26 | 15 | 13 | 27 | 24 | 26 | 24 | 21 | 21 | 15 | 16 | 14 | 24 | 26 |
| భరణి | 14 | 29 | 22 | 19 | 17 | 19 | 20 | 20 | 27 | 28 | 26 | 10 | 10 | 20 | 24 | 22 | 16 | 28 |
| కృత్తిక1 | 27 | 15 | 19 | 16 | 20 | 26 | 24 | 19 | 14 | 15 | 10 | 25 | 25 | 27 | 19 | 17 | 19 | 11 |
| కృత్తిక3 | 22 | 10 | 14 | 21 | 25 | 31 | 20 | 13 | 09 | 14 | 10 | 23 | 29 | 31 | 23 | 20 | 22 | 14 |
| రోహిణి | 19 | 15 | 09 | 16 | 30 | 24 | 14 | 20 | 11 | 17 | 18 | 20 | 26 | 24 | 30 | 27 | 26 | 19 |
| మృగ2 | 10 | 25 | 17 | 23 | 22 | 25 | 15 | 11 | 18 | 21 | 24 | 13 | 19 | 27 | 29 | 26 | 17 | 27 |
| మృగ2 | 14 | 27 | 19 | 14 | 11 | 13 | 23 | 18 | 24 | 20 | 25 | 12 | 13 | 21 | 23 | 27 | 17 | 27 |
| ఆర్ద్ర | 20 | 27 | 20 | 13 | 17 | 04 | 16 | 27 | 27 | 22 | 22 | 17 | 18 | 11 | 16 | 19 | 27 | 27 |
| పున3 | 18 | 27 | 21 | 13 | 20 | 05 | 13 | 26 | 27 | 27 | 13 | 17 | 18 | 11 | 17 | 19 | 27 | 28 |
| పున1 | 20 | 27 | 20 | 19 | 26 | 10 | 08 | 20 | 21 | 28 | 27 | 21 | 12 | 07 | 11 | 17 | 25 | 25 |
| పుష్యమి | 11 | 26 | 27 | 20 | 19 | 22 | 17 | 11 | 22 | 26 | 25 | 13 | 04 | 14 | 18 | 24 | 18 | 27 |
| ఆశ్లేష | 25 | 11 | 16 | 15 | 20 | 26 | 22 | 16 | 08 | 12 | 13 | 27 | 18 | 18 | 12 | 18 | 20 | 12 |
| మఘ | 25 | 11 | 17 | 24 | 26 | 34 | 24 | 21 | 11 | 05 | 04 | 18 | 24 | 25 | 18 | 17 | 18 | 12 |
| పుబ్బ | 11 | 25 | 19 | 26 | 24 | 24 | 19 | 19 | 27 | 21 | 18 | 04 | 11 | 19 | 24 | 23 | 16 | 24 |
| ఉ.ఫ.1 | 17 | 26 | 17 | 24 | 32 | 19 | 10 | 27 | 28 | 22 | 20 | 11 | 18 | 12 | 16 | 15 | 26 | 24 |
| ఉ.ఫ.3 | 16 | 25 | 16 | 18 | 27 | 13 | 15 | 28 | 29 | 26 | 25 | 16 | 05 | 10 | 14 | 18 | 29 | 27 |
| హస్త | 19 | 26 | 17 | 19 | 26 | 12 | 14 | 26 | 27 | 23 | 24 | 19 | 19 | 07 | 14 | 19 | 27 | 27 |
| చిత్త2 | 20 | 19 | 26 | 28 | 11 | 25 | 28 | 13 | 21 | 17 | 19 | 18 | 18 | 24 | 18 | 22 | 11 | 21 |
| చిత్త2 | 28 | 27 | 34 | 24 | 07 | 21 | 28 | 13 | 21 | 25 | 26 | 27 | 20 | 26 | 20 | 15 | 04 | 13 |
| స్వాతి | 28 | 28 | 20 | 10 | 23 | 18 | 23 | 26 | 18 | 22 | 23 | 27 | 21 | 20 | 25 | 19 | 20 | 13 |
| విశాఖ3 | 34 | 18 | 28 | 18 | 17 | 21 | 28 | 21 | 13 | 17 | 17 | 32 | 27 | 26 | 22 | 16 | 13 | 05 |
| విశాఖ1 | 23 | 08 | 17 | 28 | 27 | 31 | 23 | 17 | 09 | 12 | 12 | 27 | 27 | 26 | 22 | 21 | 18 | 09 |
| అనురాధ | 07 | 22 | 17 | 28 | 28 | 31 | 16 | 14 | 22 | 25 | 26 | 12 | 12 | 22 | 24 | 24 | 18 | 27 |
| జ్యేష్ఠ | 20 | 17 | 20 | 31 | 30 | 28 | 15 | 17 | 17 | 20 | 20 | 25 | 25 | 18 | 11 | 09 | 21 | 21 |
| మూల | 21 | 21 | 27 | 24 | 26 | 16 | 28 | 27 | 25 | 15 | 15 | 21 | 25 | 21 | 11 | 17 | 25 | 27 |
| పూ.షా | 11 | 26 | 19 | 18 | 18 | 19 | 27 | 28 | 34 | 24 | 23 | 08 | 15 | 22 | 29 | 32 | 23 | 32 |
| ఉ.షా.1 | 20 | 19 | 12 | 11 | 25 | 19 | 25 | 34 | 28 | 18 | 15 | 15 | 02 | 22 | 28 | 31 | 32 | 23 |
| ఉ.షా.3 | 24 | 23 | 16 | 14 | 28 | 22 | 16 | 25 | 19 | 28 | 25 | 25 | 17 | 17 | 23 | 30 | 32 | 23 |
| శ్రవణం | 25 | 23 | 16 | 14 | 28 | 23 | 17 | 25 | 16 | 24 | 28 | 30 | 21 | 18 | 23 | 32 | 31 | 24 |
| ధనిష్ఠ2 | 24 | 26 | 30 | 28 | 14 | 28 | 21 | 09 | 16 | 25 | 21 | 28 | 18 | 23 | 21 | 26 | 15 | 22 |
| ధనిష్ఠ2 | 19 | 22 | 25 | 28 | 12 | 26 | 29 | 16 | 13 | 18 | 21 | 20 | 28 | 33 | 28 | 18 | 07 | 14 |
| శతభిషం | 26 | 19 | 26 | 26 | 21 | 19 | 22 | 23 | 23 | 18 | 18 | 25 | 33 | 28 | 19 | 09 | 17 | 16 |
| పూ.భా.3 | 19 | 28 | 21 | 21 | 27 | 12 | 15 | 30 | 29 | 24 | 25 | 20 | 27 | 19 | 28 | 18 | 23 | 20 |
| పూ.భా.1 | 12 | 20 | 14 | 21 | 27 | 11 | 15 | 31 | 30 | 28 | 30 | 25 | 17 | 07 | 16 | 28 | 33 | 30 |
| ఉ.భా. | 03 | 19 | 12 | 19 | 20 | 22 | 24 | 22 | 31 | 29 | 29 | 14 | 06 | 16 | 21 | 33 | 28 | 34 |
| రేవతి | 13 | 11 | 05 | 12 | 27 | 22 | 27 | 30 | 21 | 19 | 22 | 22 | 14 | 16 | 18 | 29 | 33 | 28 |





## నక్షత్ర విశేషములు

వివాహ విషయములో ఈ టేబుల్ వధూవర గణ సమ్మేళనం పరిశీలించాలి

| నక్షత్రం | పాదం | రాశి | రాశ్యాధిపతి | గణం | నామాక్షరము | యోని | నాడీ | రజ్జు | వేధానక్షత్రం | స్త్రీ/పు/నపుం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | 1,2,3,4 | మేషం | కుజ | దేవ | చూ,చే,చో,లా | గుర్రం | ఆది | పాద | జ్యేష్ఠ | పుం |
| భరణి | 1,2,3,4 | మేషం | కుజ | మనుష్య | లీ,లూ,లే,లో | ఏనుగు | మధ్య | కటి | అనురాధ | స్త్రీ |
| కృత్తిక | 1 | మేషం | కుజ | రాక్షస | ఆ | మేక | అంత్య | ఉదర | విశాఖ | పుం |
| కృత్తిక | 2,3,4 | వృషభం | శుక్ర | రాక్షస | ఈ,ఊ,ఏ | మేక | అంత్య | ఉదర | విశాఖ | పుం |
| రోహిణి | 1,2,3,4 | వృషభం | శుక్ర | మనుష్య | వో,వా,వీ,వూ | సర్పం | అంత్య | కంఠ | స్వాతి | పుం |
| మృగశిర | 1,2 | వృషభం | శుక్ర | దేవ | వే,వో | సర్పం | మధ్య | శిరో | ధని, చిత్త | నపుం |
| మృగశిర | 3,4 | మిధునం | బుధుడు | దేవ | కా,కి | సర్పం | మధ్య | శిరో | చిత్త, ధని | నపుం |
| ఆర్ద్ర | 1,2,3,4 | మిధునం | బుధ | మనుష్య | కూ,ఖం,జ,ఛ | కుక్క | ఆది | కంఠ | శ్రవణం | స్త్రీ |
| పునర్వసు | 1,2,3 | మిధునం | బుధ | దేవ | కే,కొ,హా | పిల్లి | ఆది | ఉదర | ఉ.షాఢ | పుం |
| పునర్వసు | 4 | కర్కాటకం | చంద్ర | దేవ | హి | పిల్లి | ఆది | ఉదర | ఉ.షాఢ | పుం |
| పుష్యమి | 1,2,3,4 | కర్కాటకం | చంద్ర | దేవ | హూ,హే,హో,ఢా | మేక | మధ్య | కటి | పూ.షాఢ | పుం |
| ఆశ్రేష | 1,2,3,4 | కర్కాటకం | చంద్ర | రాక్షస | డీ,డూ,డే,డొ | పిల్లి | అంత్య | పాద | మూల | స్త్రీ |
| మఘ | 1,2,3,4 | సింహం | రవి | రాక్షస | ము,మే,మూ,మే | ఎలుక | అంత్య | పాద | రేవతి | స్త్రీ |
| పుబ్బ | 1,2,3,4 | సింహం | రవి | మనుష్య | మో,టా,టే,టూ | ఎలుక | మధ్య | కటి | ఉ.భాద్ర | స్త్రీ |
| ఉత్తర | 1 | సింహం | రవి | మనుష్య | టే | వృషభం | ఆది | ఉదర | పూ.భాద్ర | స్త్రీ |
| ఉత్తర | 2,3,4 | కన్య | బుధ | మనుష్య | టో,పా,పీ | వృషభం | ఆది | ఉదర | పూ.భాద్ర | స్త్రీ |
| హస్త | 1,2,3,4 | కన్య | బుధ | దేవ | పూ,ష,ణా,ఠా | మహిషం | ఆది | కంఠ | శతభిషం | పుం |

| | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| చిత్త | 1,2 | కన్య | బుధ | రాక్షస | పే,పో | పులి | మధ్య | శిరో | మృగ,ధని | స్త్రీ |
| చిత్త | 3,4 | తుల | శుక్రుడు | రాక్షస | రా,రి | పులి | మధ్య | శిరో | ధని, మృగ | స్త్రీ |
| స్వాతి | 1,2,3,4 | తుల | శుక్ర | దేవ | రూ,రే,రో,తా | మహిషం | అంత్య | కంఠ | రోహిణి | స్త్రీ |
| విశాఖ | 1,2,3 | తుల | శుక్ర | రాక్షస | తీ,తూ,తే | పులి | అంత్య | ఉదర | కృత్తిక | స్త్రీ |
| విశాఖ | 4 | వృశ్చికం | కుజ | రాక్షస | తొ | పులి | అంత్య | ఉదర | కృత్తిక | స్త్రీ |
| అనురాధ | 1,2,3,4 | వృశ్చికం | కుజ | దేవ | నా,నీ,నూ,నే | లేడి | మధ్య | కటి | భరణి | పుం |
| జ్యేష్ఠ | 1,2,3,4 | వృశ్చికం | కుజ | రాక్షస | నో,యా,యి,యూ | లేడి | ఆది | పాద | అశ్వని | స్త్రీ |
| మూల | 1,2,3,4 | ధనుః | గురువు | రాక్షస | యే,యో,బా,బీ | కుక్క | ఆది | పాద | ఆశ్రేష | నపుం |
| పూ.షా. | 1,2,3,4 | ధనుః | గురువు | మనుష్య | బూ,ధా,భా,ఢా | కోతి | మధ్య | కటి | పుష్యమి | స్త్రీ |
| ఉ.షా. | 1 | ధనుః | గురువు | మనుష్య | బే | ముంగిస | అంత్య | ఉదర | పునర్వసు | స్త్రీ |
| ఉ.షా. | 2,3,4 | మకరం | శని | మనుష్య | బొ,జా,జీ | ముంగిస | అంత్య | ఉదర | పునర్వసు | స్త్రీ |
| శ్రవణం | 1,2,3,4 | మకరం | శని | దేవ | జు,జే,జో,ఖా | కోతి | అంత్య | కంఠ | ఆర్ద్ర | పుం |
| ధనిష్ఠ | 1,2 | మకరం | శని | రాక్షస | గా,గీ | సింహం | మధ్య | శిరో | చిత్త,మృగ | స్త్రీ |
| ధనిష్ఠ | 3,4 | కుంభం | శని | రాక్షస | గూ,గే | సింహం | మధ్య | శిరో | చిత్త,మృగ | స్త్రీ |
| శతభిషం | 1,2,3,4 | కుంభం | శని | రాక్షస | గొ,సా,సీ,సు | గుర్రం | ఆది | కంఠ | హస్త | పుం |
| పూర్వాభాద్ర | 1,2,3 | కుంభం | శని | మనుష్య | సే,సొ,దా | సింహం | ఆది | ఉదర | ఉత్తర | స్త్రీ |
| పూర్వాభాద్ర | 4 | మీనం | గురువు | మనుష్య | ది | సింహం | ఆది | ఉదర | ఉత్తర | స్త్రీ |
| ఉత్తరాభాద్ర | 1,2,3,4 | మీనం | గురువు | మనుష్య | దు,శ్శ,ఝూ,థా | గోవు | మధ్య | కటి | పుబ్బ | పుం |
| రేవతి | 1,2,3,4 | మీనం | గురువు | దేవ | దే,దొ,చా,చి | ఏనుగు | అంత్య | పాద | మఘ | పుం |

కృష్ణ - మృగశిర 3వ పాదం : హృష్ణ - స్వాతి 3; శ్రీధర - చిత్త 4 క్షేత్రపాలః - హస్త 2; జ్ఞాన - ఆర్ద్ర 3; భీమ, భైరవ. పూ.షా.3 ఫణి - ఉత్తర3 - ద్రౌపది, ద్రోణ : - స్వాతి 3వ పాదం





**కన్యాదాతల నిర్ణయం :** కన్యాదానము చేయు అధికారము తండ్రికి, తండ్రి కానిచో పితామహుడు, సోదరుడు, పినతండ్రి, పెత్తండ్రి మొదలగు పితృ వంశస్థులు. వారు కానిచో మాతృ వంశస్థులగు మాతామహుడు, మేనమామలు వారు కానిచో స్వగోత్రికులు కానిచో ఎవరైనను చేయవచ్చును.

**ఏకోదర వివాహము :** పుత్రీ పాణీని పీడనాచ్చ పరతస్సూనో ర్వివాహశ్శుభో, నాన్యత్రుత్ర కరగ్రహత్తునక ముప్యుద్వాహ ఏవవ్రతాత్'

అనే కాలామృత శ్లోకాధారముగా ఏక కాలమునందు పుత్ర పుత్రికా వివా హముల విషయాలలో పుత్రికా వివాహానంతరము పుత్ర వివాహము ముఖ్య మనియు పుత్ర వివాహానంతరము పుత్రికా వివాహమయినను, పుత్ర ఉపనయ నము అయినను చేయకూడదనియు పుత్ర ఉపనయనానంతరము పుత్రికా వివాహము శుభకరమనియు పుత్ర వివాహము చేసిన సంవత్సరమందు ఆరు నెలల పర్యంతము ఏకోదరులకు ఉపనయనాదులు అశుభకరములు. "ఫాల్గునే చైత్ర మాసేతు పుత్రోద్వాహోపనాయనే అబ్ద భేదాత్రకుర్వీత ఋతుత్రయ విడంబన" అనగా ఫాల్గుణంలో ఒకరికి, చైత్రములో మరొకరికి సంవత్సరభేదం ఉన్నందున వివాహ, ఉపనయనాదులు చేయవచ్చును.

**నూతన వధూవాస దోషము :** "వివాహాత్రథమే పౌషే ఆషాఢే చాధి మాసకే, నసా భర్తృగృహే తిష్ఠే చైత్రే పితృగృహే తథా" వివాహం అయిన ప్రథమ సంవత్సరం ఆ వధువు అత్తవారింట ఉన్నచో ఆషాఢమాసంలో అత్తగారికినీ, అధిక మాసమందు భర్తకును, పుష్యమాసంలో మామగారికినీ గండము. మొదటి సంవత్సరం చైత్రమాసంలో తండ్రి యింట ఉన్న ఎడల తండ్రికి హాని అని వున్నది. కానీ ఈ ఒక్క విషయము ఆచారం లేదు.



**పునర్వివాహం :** ప్రమదామృతి వాసరాదితః పునరుద్వాహ విధిర్వరస్యచ విషమే పరివత్సరే శుభోయుగళేచాపి మృతి ప్రదోభవేత్" అనగా పూర్వభార్య మృతినొందిన దిన ప్రభృతి బేసి సంవత్సరములయందు పునర్వివాహము చేసుకొనుట శుభము. సరి సంవత్సరములయందు అశుభము.

"తృతీయా మానుషీకన్యా నోద్వాహ్యా మ్రియతేహిసాః విధవా వాభవేత్తస్మాత్ తృతీయేర్కం సముద్వహేత్" మూడవ వివాహము మనుష్య కన్యకు చేసుకొనుట పనికిరాదు. అట్లైనచో భార్యకు మృతి కలుగును. విధవ అయిన అగును. కావున తృతీయము అర్క వివాహము చేయునది.

**వివాహ ప్రయత్నం ఎప్పుడు ప్రారంభించాలి ? :** వివాహం చేయవలెను అని తలచినప్పుడు ఎవరి వివాహ ప్రయత్నములు చేయదలచారో వారికి నక్షత్రం తారాబలం కుదిరిన రోజున, భరణి, కృత్తి, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్రేష, పుబ్బ, చిత్త, విశాఖ, జేష్ఠ, పూర్వాషాడ, పూర్వాభాద్రలను

విడిచి, మంగళ, సోమ వారములు కాకుండా, వర్జ్య దుర్ముహూర్తములు లేని సమయంలో గణపతిని ప్రార్ధించి తదుపరి యిష్టదైవమును ప్రార్ధించి వివాహ ప్రయత్నం చేయవలెను.



**పెండ్లి చూపులకు :** సోమ, మంగళ వారములు కాకుండాను భరణి, కృత్తిక, ఆర్ద్ర, ఆశ్రేష, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు కాకుండా, వర్జ్య దుర్ముహూర్తములు లేకుండాను, చవితి, షష్ఠి, అష్టమి, ద్వాదశి, అమావాస్య కాకుండా శుభగ్రహ హోరలయందు పగటి సమయమున పెండ్లిచూపులు ఏర్పాటు చేయవలెను. అత్యవసరస్థితిలో మూఢములో మల మాసములో, శూన్య మాసములో వధూవరులు చూడదలచిన దేవాలయములో ప్రథమతః చూచుకొనుట శ్రేయస్కరము.

**నిశ్చితార్థం :** నిశ్చితార్థమునకు పెండ్లితో సమానమైన, సమాన బలమైన ముహూర్తం చూడవలెను.



కారణం నిశ్చితార్థంతోనే వధూవరుల బంధం ప్రారంభం అవుతుంది. అంతేకాకుండా జాతక ప్రభావాలు వారిరువురికీ ఒకరి ప్రభావం మరొకరి మీద ఈ ముహూర్తం నుండే ప్రారంభం అవుతాయి. వివాహ ముకు సంబంధించిన తిధి వార నక్షత్ర లగ్నములు చూడవలెను. అయితే నిశ్చితార్థం రోజున గణపతి పూజ చేయవలెను. కావున భోజనానంతరం పూజ పనికిరాదు. కావున ఉదయ సమయంలోనే నిశ్చితార్థం చేయవలెను.



**పెండ్లి పనులు ప్రారంభించుటకు :** సోమ, మంగళ వారములు విడువవలెను. అశ్వని, రోహిణి, మృగశిర, పునర్వసు, పుష్యమి, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనురాధ, మూల, ఉషా, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, ఉత్తరాభాద్ర, రేవతి నక్షత్రముల యందు విదియ, తదియ, పంచమి, సప్తమి, దశమి, ఏకాదశి, త్రయోదశి, పౌర్ణిమ, బహుళ పాడ్యమి తిధుల యందు, శుభగ్రహహోరల యందు వర్జ్యం దుర్ముహూర్తం వదిలి పెండ్లి పనులు ప్రారంభించాలి.



**వివాహం :** భరణి, కృత్తిక, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్రేష, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర నక్షత్రములు పనికిరావు. చిత్త పనికి వస్తుంది అని కొందరి వాదన. బుధ, గురు, శుక్ర, శని ఆదివారములు పనికి వస్తాయి. అయితే అన్ని గ్రంధాలలో శుభగ్రహవారములు అని ఉన్న కారణంగా క్షీణచంద్రుడు కాని సమయంలో ఉన్న సోమవారం పనికివస్తుంది. "మాసాంతే దిన పంచకే పితృతిధౌ" బహుళ ఏకాదశి నుండి అయిదు రోజులు, పితృ తిథులు ఉన్న రోజులలో







వివాహం పనికిరాదు. పాప గ్రహవీక్షణ ఉన్న లగ్నములు సప్తమంలో, అష్టమంలో పాపగ్రహములు ఉన్న లగ్నములు పనికిరావు. మాఘ, ఫాల్గుణ, చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, శ్రావణ ఆశ్వయుజంలో దసరా తర్వాత కార్తీకం, మార్గశిరంలో ధనుర్మాసం ముందర వివాహములు చేయుట ఆచారంగా ఉన్నది. మధ్యాహ్నం 12 లోపల, మరల సూర్యాస్తమయం తర్వాత వివాహం చేయవచ్చు.

**వివాహం - ఆబ్దీకం :** వివాహముకు ముందు రోజు ఆబ్దీకము ఉన్నచో ఆ ముహూర్తం పనికిరాదు. ఇది కన్యాదాత విషయంలోను వరుడు, వరుని తండ్రి ఆబ్దీకములు పెట్టవలసిన విషయంలో మాత్రమే. వివాహం చేసిన నెలలోపుగా వధూవరుల ఇండ్ల వారి పై తరాలవారి ఆబ్దీకములు రాకుండా చూసుకుని వివాహముహూర్తం నిర్ణయించాలి. తల్లిదండ్రుల ఆబ్దీకములు విసర్జించుట, మతాంతరం చేయుట శ్రేయస్కరం కాదు.

**వధూప్రవేశము :** "వివాహ మారభ్య వధూప్రవేశో యుగ్మేదినో షోడశవాసంరాంతే" వివాహ దిన ప్రభృతి పదహారు రోజుల లోపల ఎప్పుడైననూ సరి దినములయందు నూతన వధువు గృహప్రవేశము చేయవచ్చును.

"వధూ ప్రవేశోనది వా. ప్రశస్తః" నూతన వధువు అత్తవారింట అడుగు పెట్టవలెను అంటే పగలు పనికిరాదు. సూర్యాస్తమయాత్ పరం, సూర్యోదయాత్ పూర్వము ప్రశస్తము.



**షష్ఠేష్టమేవా దశమే దినేవా వివాహ మారభ్య వధూ ప్రవేశః**
**పంచాంగ శుద్ధంచ దినం వినాపి తిథౌన సద్గోచరకేపికార్యః**

అనగా వివాహము అయినది మొదలు ఆరు, ఎనిమిది, పది దినములందు వధువు నూతనముగా ప్రవేశించిన ఎడల ఆ దినములు తిధి వారనక్షత్ర యోగకరణములచే శుద్ధము కాకపోయినప్పటికీ శుభ ప్రదముగానే వుంటుంది.

ఒకవేళ మొదటినెలలో వధూప్రవేశం జరగనిచో మొదటి సంవత్సరం మూడు, ఐదు సంవత్సరాలలో బేసి నెలలో స్థిర, క్షిప్ర, మృదు, శ్రవణ, ధనిష్ఠ, మూల, మఘ, స్వాతి నక్షత్ర దినములందు రిక్త తిథులను విడిచి నూతన వధూ ప్రవేశం చేయవలెను. ఎప్పుడు వధూ ప్రవేశం చేసిననూ వర్జ్య దుర్ముహూర్త కాలములు విడువవలెను.



**వ్యాపార ముహూర్త విషయం :** అశ్వని, హస్త, పుష్యమి, చిత్త, రేవతి, అనురాధ, మృగశిర నక్షత్రములు వ్యాపారమునకు రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర నక్షత్రములందు మంచిది. రిక్త తిథులను, మంగళవారములను విడిచి వ్యాపారము ప్రారంభించుట విశేషము. వ్యాపార నిమిత్తము వస్తువులు కొనుగోలు చేయుటకు అశ్వనీ, స్వాతీ, శ్రవణం, చిత్త, శతభిషం,

రేవతి నక్షత్రములు విశేషములు. భరణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, విశాఖ, ఆశ్రేష, కృత్తిక నక్షత్రములందు వస్తువిక్రయం (అమ్మట) ప్రారంభించుట విశేషం.

లగ్న ద్వితీయ, చతుర్థ, పంచమ, సప్తమ, నవమ, దశమ, ఏకాదశములందు శుభ గ్రహములుండగాను కుంభేతర లగ్నములందు వ్యాపారారంభ లగ్నము నిర్ణయించవలెను. వ్యాపారారంభమునకు రిక్త తిథులు, మంగళవారము పనికి రాదు. అలాగే అష్టమ ద్వాదశ శుద్ధి అవసరము. వ్యాపారముకు లగ్నమందు చంద్ర శుక్రులు విశేషము. చంద్ర, బుధ, గురువుల బలము వున్న ముహూర్తము చూడవలెను.

**ఔషధసేవ :** హస్తత్రయే పుష్య పునర్వసౌచ విష్ణుత్రయే చాశ్వనీ పౌష్ణ భేషు । మిత్రేందు మూలేషుచ సూర్యవారే భైషజ్యముక్తం శుభ వాసరేపి ॥ హస్త, చిత్త, స్వాతి, పుష్యమి, పునర్వసు, శ్రవణ, ధనిష్ఠ, శతభిషం, అశ్వనీ, రేవతి, అనురాధ, మృగశిర, మూలా నక్షత్ర దినముల యందును రవి, సోమ, బుధ, గురు, శుక్ర వారములందును... యోగ్య తిథులయందును “శుద్ధేరిః షధ్యున మృతిగృహే నత్రిధానో జనేర్‌క్షే” లగ్నాత్ పన్నెండు సప్తమ, అష్టమ స్థానములందు గ్రహములు లేకుండగాను ఔషధసేవ ప్రారంభం చేయవలెను. జన్మనక్షత్రంలో ఔషధసేవ చేయకూడదు.



**నవవస్త్రాభరణధారణ :** విప్రాజ్ఞయందు, ఉత్సవములయందు ఈ క్రింద చెప్పిన తిథివార నక్షత్ర సంబంధం లేకుండా వస్త్రభూషణ ధారణ చేయవచ్చును. రేవతీ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, ధనిష్ఠ, పునర్వసు, పుష్యమి యందు రిక్తేతర తిథులయందు, ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారముల యందును నూతన వస్త్రాభరణధారణ మంచిది. మంగళవారం ఎర్రని వస్త్రములు ధరించుట మంచిది. పునర్వసు, పుష్యమి నక్షత్రములయందును ధృవ నక్షత్రములయందును, మంగళవారము నందును సౌభాగ్యవతియగు స్త్రీ నూతన వస్త్రాభరణధారణ చేయకూడదు.



**సేవకా, శయ్యాది విషయము :** పాదుకలు, ఆసనములు, మంచములు వాడుక విషయంలో ధృవ, క్షిప్ర, మృదు నక్షత్రములగు శ్రవణం, భరణి, పునర్వసు నక్షత్రముల యందును, మంచి తిథుల యందును వాడకం ప్రారంభించుట మంచిది. క్షిప్ర, ధృవ నక్షత్రముల యందును, అనురాధ, పుష్యమీ నక్షత్రముల యందును, బుధ, గురు, శుక్ర, ఆదివారముల యందును, సేవాకార్యం నౌకరీ ప్రారంభించవలెను. శుభలగ్నము లందు దశమ, ఏకాదశ స్థానములందు రవి లేక కుజుడు వుండగా ప్రారంభించవలెను.

**కృషికర్మ :** మృదు, స్థిర, క్షిప్ర, చర, మూల, మఘ నక్షత్రముల యందు మొదటి సారిగా కృషికర్మ ప్రారంభించవలెను. ఆది, మంగళవారములను విడిచి చవితి, షష్ఠి, నవమి, చతుర్దశి తిథులను, దగ్ధ తిథులను విడిచి, వైధృతి, వ్యాఘాత, వ్యతీపాత యోగములను విడిచి,







భద్రకరణమును విడిచి మిగిలిన తిథి, వార, యోగకరణ దినములందు కృషికర్మ ప్రారంభించవలెను.

కృషికర్మ మేష, సింహ, కుంభ, కర్కాటక, మకర, తులల యందు ప్రారంభించకూడదు. చంద్ర, శుక్రులు బలవంతులై వుండగా, లగ్నమందు గురువు వుండగా కృషికర్మలకు యోగ్యము.

**బీజావాపనం :** అశ్వని, హస్త, పుష్యమి, చిత్త, రేవతి, మృగశిర, అనురాధల యందును, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, స్వాతీ, మూల, మఘ, శ్రవణం, ధనిష్ఠ, శతభిషములందు విత్తనములు చల్లిన ఎడల ఫలప్రదము. మంగళవారము, శనివారము, ఆదివారముల రిక్త తిథులు, పంచపర్వములు, వర్జ్యఘడియలు, ప్రదోషకాలములను విడచి వృషభ, మిథున, కర్కాటక, కన్య, వృశ్చిక, ధనుర్మీన లగ్నముల యందు విత్తనములు వేయవలెను. అనగా రవిచే విడువబడిన నక్షత్రము మొదలు మూడు నక్షత్రములు హానిని కలుగచేయును. తర్వాత ఎనిమిది వృద్ధిని కలుగచేయును. ఆ తర్వాత తొమ్మిది నక్షత్రములు కర్తకు మృత్యువును, ఆ తర్వాత ఏడు నక్షత్రములు లక్ష్మీప్రదమును కలుగచేయును. ఆశ్రేషా నక్షత్రమందును, సోమవారము నందును, చంద్రుడు లగ్నమందు బలవంతుడై వున్నచో చెరకు, అరటి, పోక చెట్లు వేయుట శుభప్రదము. అశ్వనియందు, సూర్యుడు లగ్నమందుండుగా, కొబ్బరిచెట్లు పాతించవలెను. బృహస్పతి లగ్నమందును, చంద్రుడు లగ్నాంశమందు వుండగా తమలపాకు తోటలు వేయుట మంచిది.



**పైరు కోయుటకు :** మూల, ఆర్ద్ర, జ్యేష్ఠ, ఆశ్రేష, పూర్వాభాద్ర, హస్త, కృత్తిక, ధనిష్ఠ, మృగశిర, స్వాతి, మఘ, ఉత్తర, ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, పూర్వాషాఢ, భరణి, చిత్త, పుష్యమీ నక్షత్రములందును ఆది, సోమ, బుధ, గురు, శుక్రవారము లందు రిక్తతిథులు కాకుండాను, స్థిరలగ్నము లందు పైరు కోయుట మంచిది.

**ధాన్యము నిల్వ చేయుటకు :** సాధారణ, ఉగ్ర, ఆర్ద్ర ఆశ్రేషలను విడిచి తక్కిన నక్షత్రముల యందు తుల, మేష, కర్కాటకములు లగ్నములుగా కాకుండా శుభదినమందు ఆహారము కొరకు ధాన్యము నిల్వచేయుట మంచిది. అట్లు కాక వ్యాపారార్థము ధాన్యము నిల్వచేయదలచిన ధృవ, పుష్య, విశాఖ, జ్యేష్ఠ, అశ్వనీ, చర నక్షత్రముల యందు నిల్వచేయుట మంచిది. ధీమికా శ్రవణ, ధనిష్ఠ శతభిషములు, విశాఖ, రోహిణి, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్య, పునర్వసు, స్వాతి, అశ్వనీ, జ్యేష్ఠల యందు ధనధాన్యములు నిల్వవుంచుటకు ప్రశస్తము.



**పశురక్షా ముహూర్తం :** అష్టమశుద్ధితో కూడిన శుభ లగ్నము నందును, చర నక్షత్రములందు, పశుయోని నక్షత్రములందును పశువులను దొడ్డి యందు కట్టి వేయవలెను.



**దత్తత స్వీకారము :** దత్తకుని యందు గ్రాహ్యాగ్రాహ్య విచారము సోదరులలో ఒకరికి పుత్రులు కలిగినను, ఆ సోదరులు అందరు పుత్రవంతులు అనబడుదురు. ఇది మను వచనము. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణముల వారికి మేనల్లుడును, దౌహిత్రుని దత్తత తీసుకొనుట నిషేధము.

సోదర పుత్రులు దత్త పుత్ర స్వీకారార్థము ముఖ్యులు. వారు లేనిచో సవతి సోదరుని పుత్రులు, వారు లేనిచో మేనమామ, మేనత్త కులమందు పుట్టినవారు, వారు లేనిచో సగోత్రస పిండులు, గ్రాహ్యులు. ఆడ పిల్లలకు దత్తత తీసుకొనుట శాస్త్రం కాదు. అయితే దత్తత సమాన వర్ణమునందు జనియించినవారినే తీసుకోవలెను.

దత్తతకు వెళ్ళిన వారు జనకస్థాన గోత్రమును, దత్తస్థాన గోత్రమును విడిచి మిగిలిన వారి గోత్రముల పిల్లలను వివాహము చేసుకోవలెను. వీరి సంతతికి కూడా అదే నియమము. ఈ నియమం అయిదు తరముల వరకు అని, ఏడు తరముల వరకు అని భిన్నాభిప్రాయములు వున్నవి.

**ఋణ విషయం :** ఋణములు ఇవ్వవలెను అన్నచో స్వాతి, పునర్వసు, విశాఖ, పుష్యమి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, అశ్వనిల యందు చిత్త, రేవతి, అనురాధ, మృగశిర, చర లగ్నముల యందు లగ్నాత్ కోణ స్థాన మందు శుభగ్రహములు ఉండగాను, లగ్నాత్ అష్టమ స్థానమందు గ్రహములు లేకుండా చూసి ఋణములు ఈయవలెను. మంగళ, బుధ వారములయందును, సంక్రమణములందును, హస్తా నక్షత్రముతో కూడిన ఆదివారము నందు ఋణము తీసుకొన్న యెడల ఆ ఋణము తీరుట కష్టము. వృద్ధినామ యోగము వున్న రోజున అప్పు తీసుకొన కూడదు. త్రిపుష్కరము అనగా శని, ఆది, మంగళవారములలో ఒక రోజు త్రిపాద నక్షత్రము, భద్రతిథి కలసిన దానిని త్రిపుష్కరం అందురు. ద్విపుష్కర అనగా ధనిష్ఠ, చిత్త నక్షత్రములు భద్రతిథిని కలిపి ద్విపుష్కరం అంటారు. ఈ పై రెండు విశేషములలోను ఋణములు పుచ్చుకొనకూడదు. మంగళవారం ఋణం తీర్చుట విశేషం. దారుణ, ఉగ్ర, సాధారణ, స్థిర నక్షత్రములందు, భద్ర కరణము నందు, పాతలమందు వృద్ధికోసం యిచ్చే ధనం తిరిగి పొందబడదు.

## ఏకవింశతి మహా దోషములు

1.పంచాంగశుద్ధి 2.సంక్రాంతి దోషం 3.పాపార్గళం 4. కునవాంశ 5.కుజాష్టమం 6.భృగషట్కం 7.కర్తరీ దోషం 8. అష్టమలగ్నం 9.అష్టమ చంద్రుడు 10. 6,8, 12 స్థిత చంద్ర 11.సగ్రహ చంద్ర12.దుర్ముహూర్తం 13.ఖర్జూరి చక్రం 14. గ్రహణభ దోషం 15. ఉత్పాతభం దోషం 16. క్రూర యుగ్దిష్టి 17.అశుభ విద్ధ 18. విషఘటిక 19.లగ్నాష్ట దోషం 20. గండాన్తదోషం 21.వ్యతీపాత వైధృతి





## లగ్నేషు వర్జ్య సమయాని

మేష, వృషభ, కన్య, ధనూరాశులకు ప్రారంభంలో భుజంగము అనే త్యాజ్య ఘడియలు వుండును. మీనం, మకరం, కర్కాటకం, వృశ్చికములకు అంత్యంలో రాహువు అనే త్యాజ్య ఘడియలు వుండును. మిథున కుంభ, తుల, సింహ లగ్నమునకు మధ్యలో ఘృద్ర అనే త్యాజ్య ఘడియలు వుండును. అందువలన వీటిని విడిచి మిగిలిన లగ్న కాలములో శుభకార్యములు చేసుకొనవచ్చును.

ఈ విషయం మరియు ఏకవింశతి దోషములలోని కునవాంశ ఆధారంగా పరిశీలిస్తే పుష్కరాంశలోనే సుముహూర్తం చేయవలెను అనెడి నియమం సరికాదు అని గ్రహించగలరు. అందువలన పుష్కరాంశ సమయాలలో వచ్చిన భేదములను అంతగా పరిగణనలోనికి తీసుకోనవసరం లేదు. శుభగ్రహ నవాంశలలో కూడా శుభకార్యం చేయవచ్చును.

## సంక్రమణ పుణ్యకాల విజ్ఞానము

| సంక్రాంతి | సంక్రాంతి నామం | పుణ్యకాలం ఘ. | గం॥ని॥ | పుణ్యకాల సమయం | పర్వదినాలు సంక్రాంతి కాలం నుండి | దానాలు |
|---|---|---|---|---|---|---|
| 1. మేషం | హరిపద | 10 | 4:00 | పూర్వము&పరము | | మేషం |
| 2. వృషభం | హరిపద | 16 | 6:24 | పూర్వము | 12 రో. | గోవు |
| 3. మిథునం | షడశీతి | 16 | 6:24 | పరము | 18 రో. | వస్త్రం, అన్నం, ఉదకం |
| 4. కర్కాటకం | హరిపద | 30 | 12:00 | పూర్వము | - | నెయ్యి, గోవు |
| 5. సింహం | హరిపద | 16 | 6:24 | పూర్వము | 12 రో. | బంగారం, గొడుగు |
| 6. కన్య | షడశీతి | 16 | 6:24 | పరము | 14 రో. | వస్త్రం, గృహం |
| 7. తుల | హరిపద | 10 | 4:00 | పూర్వము&పరము | ఆఖరి 16 రో. పితృపక్షం యజ్ఞసమానం | నువ్వులు, మజ్జిగ |
| 8. వృశ్చికం | హరిపద | 16 | 6:24 | పూర్వము | 12 | దీపదానం |
| 9. ధనస్సు | షడశీతి | 16 | 6:24 | పరము | 26 | వస్త్రం, వాహనం |
| 10. మకరం | హరిపద | 30 | 12:00 | పరము | - | కట్టెలు, బంగారం, ఇత్తడి |
| 11. కుంభం | హరిపద | 16 | 6:24 | పూర్వము | 12 | గోవు, జలం, తృణధాన్యాలు |
| 12. మీనం | షడశీతి | 16 | 6:24 | పరము | 22 | గృహం, మాల |

## సాయన ప్రవేశాలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. మేషాయనం | - | విషువత్ | - | నిరయణ సంక్రాంతి |
| 2. కటకాయనం | - | దక్షిణాయనం | - | పుణ్యకాలం నియమాలే |
| 3. తులాయనం | - | విషువత్ | - | వీటికి కూడా |
| 4. మకరాయనం | - | ఉత్తరాయనం | - | 30 ఘడియలు పూర్వం |

తక్కిన 8 సాయన ప్రవేశాలు : వృషాయనం, మిథునాయనం, సింహాయనం, కన్యాయనం, వృశ్చికాయనం, ధనురాయనం, కుంభాయనం, మీనాయనంకు నిరయణ సంక్రాంతి పుణ్యకాల నియమాలే వర్తించును.

సాయన మేషాయనం, తులాయనంని మాత్రమే విషువత్‌లు అని అనాలి. సాయన కటకాయనాన్ని మాత్రమే దక్షిణాయనం అనాలి. సాయన మకరాయనాన్ని మాత్రమే ఉత్తరాయనం అనాలి. అవి సాయనంలో మాత్రమే జరుగుతాయి. నిరయణంతో అన్నీ సంక్రాంతులే. నిరయణంలో విషువత్‌లు, అయనాలు కేవలం అయన శూన్యమప్పుడు మాత్రమే జరుగును. అది ఒక లిప్తకాలం మాత్రమే ఉంటుంది. పూర్తి వివరముల కొరకు సిద్ధాంతగ్రంథ అధ్యయనం, నిర్ణయ సింధువు, జ్యోతిర్విదాభరణం మొదలగు గ్రంథాలు చూడగలరు.

# శంఖుస్థాపనాది శుభ ముహూర్తములకు యోగ్యమైన తిథి వార నత్ర లగ్న శుద్ధి చక్రము

| శుభకార్యము | తిథులు | వారములు | నక్షత్రములు | లగ్నములు | శుద్ధి – విశేషములు |
|---|---|---|---|---|---|
| గృహారంభం | 2, 3, 5, 7, 10 11, 13, 15 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, రో, మృ, ఉత్తరాత్రయం, హస్త చిత్త, స్వాతి, అనూ, శ్ర, ధని, శత, రేవతి | వృష, మి, సిం, కన్య వృశ్చి, కుంభం, మీనం | అష్టమ శుద్ధి-కర్తరీ, మిధున ధనుర్మాసములు, చక్రశుద్ధులు నింద్యములు |
| గ్రహప్రవేశం | 1, 3, 5, 7, 10 11, 13, 15 | సోమ, బుధ గురు, శుక్ర | రోహి, మృగ, ఉత్తరాత్రయం, చిత్త అనూ, ధని, శత, రేవతి (పుష్యమి) | వృష, మి, సిం, కన్య, వృశ్చి ధను, కుంభ, మీనం | అష్టమశుద్ధి – కలశ చక్ర శుద్ధి (చతుర్ధ శుద్ధి) |
| నిషేకం | 2, 3, 5, 7 10, 13 | ఆది, సోమ బు, గు, శు | రో, మృ, పున, పుష్య, ఉత్తరాత్రయం హ, చి స్వాతి, అనూ, మూ, శ్రవ, ధని, శత, ఆర్ధ పూర్వాత్రయం | శుభయుత దృష్ట లగ్నములు | సంధ్యా, పర్వ, ప్రదోష, వ్రత శ్రాద్ధ సమయాలు నింద్యం |
| గర్భాదానం | 2, 3, 5, 7 10, 13 | ఆది, సోమ బు, గు, శు | రో, మృ, పున, పుష్య, ఉత్తరాత్రయం హ, చి స్వా, అనూ, మూ, శ్రవ, ధని, శత, ఆర్ధ పూర్వాత్రయం | శుభయుత దృష్ట లగ్నములు | సంధ్యా, పర్వ, ప్రదోష, వ్రత, శ్రాద్ధ సమయాలు నింద్యం |
| పుంసవనం సీమంతములు | 2, 3, 5, 7, 10 11, 13, 15 | ఆది, మంగ బు, గు, శు | మృ, పున, పుష్య, హ, అనూ, శ్రవ, ధ, శత, రే (అశ్వి, రో, చి, స్వా, ఉత్తరాత్రయం) | మే, వృష, మి, తుల, కుంభ, మీనం | పుంసవమునకు 3వ నెల సీమంతమునకు 4, 6, 9 నెలలు |
| జాతకర్మ నామకరణములు | 2, 3, 5, 7, 10 11, 13 | ఆది, సోమ బు, గు, శు | అశ్వి, రో, మృ, పున, పుష్య, హ, చి, స్వా అనూ, ఉత్తరాత్రయం, శ్ర, ధని, శత, రేవతి | శుభ లగ్నములు | అష్టమశుద్ధి, లగ్నశుద్ధి |
| అన్నప్రాశనం | 2, 3, 5, 7 10, 13, 15 | ఆది, సోమ బు, గు, శు | అశ్వి, రో, మృ, పున, పుష్య, ఉత్తరాత్రయం హ, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, రేవతి | మేష, మీన, వృశ్చిక, వివా | దశమ శుద్ధి, పూర్వాహ్ణం పురుషులకు సరి, స్త్రీలకు బేసినెలలు |
| కర్ణవేధ | 2, 3, 5, 7 10, 13, 15 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి రో, మృ, ఆర్ద్ర, పున, పుష్య, ఉత్తరాత్రయం హ, చి, శ్రవ, ధన, శత, అనూ, రేవతి | మేష వృష, మిధున, కటక, కన్య తుల, ధను, మక, మీనం | 6, 7, 8 మాసములు అష్టమశుద్ధి |
| కేశఖండనం | 2, 3, 5, 7, 10 11, 13, 15 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, మృగ, పున, పుష్య, హ, చి, స్వా (జ్యే) శ్రవ, ధన, శత (రేవతి) | శుభ లగ్నములు | ఉత్తరాయన పూర్వాహ్ణం బేసి మాసములు, అష్టమశుద్ధి |
| అక్షరాభ్యాసం | 2, 3, 5, 7 10, 11, 13 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, రేవతి, పున, పుష్య, హ, చి, స్వా అనూ, శ్రవ, (మృ, ఆర్ద్ర, ధని, శత) | మే, కన్య, ధను, మీనం | అష్టమ శుద్ధి, ఉత్తరాయణ 5వ సంవత్సరం, 3వ సంవత్సరం |





| | | | | | |
|---|---|---|---|---|---|
| విద్యారంభం | 2, 3, 5, 7 10, 11, 13 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, మృగ, ఆర్ద్ర, పున, పుష్య, ఆశ్రే, పూర్వా త్రయం, హ, చి, స్వా, మూ, శ్రవ (ధ,శ,అనూ) | మే, మి, కటక, కన్య, తుల ధన, మకరం | దివా భాగము శుభము |
| ఉపనయనం | 2, 3, 5, 7, 10 11-(6-12) | సోమ, బుధ గురు, శుక్ర | అశ్విని, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం హ, చి, స్వా, అనూ, శ్ర, ధ, శత, రేవతి | శుభలగ్నములు | అష్టమశుద్ధి మీన చైత్రము శుభము |
| వివాహం | 2, 3, 5, 7, 10 11, 12, 13, 15 | బుధ, గురు శుక్ర | రో, మృగ, మఘ, ఉత్తరాత్రయం, హ, అనూ స్వాతి, మూ, శత, రే. (అశ్వి, శ్ర, చి, ధ) | శుభలగ్నములు | జామిత్ర శుద్ధి |
| వాపీ కూపాదికం | 1, 3, 5, 7 10, 11, 13, 15 | సోమ, బుధ గురు, శుక్ర | అశ్వి, రో, మృ, పుష్య, ఉత్తరాత్రయం, హస్త అనూ (జ్యే), మూల, శ్రావణ, ధని, శత, రేవతి | కర్కాటకం, మకరం, కుంభం, మీనం | ఆగ్నే, దక్షిణ, నైఋతి, వాయు దిశలు గృహం మధ్యం కూడదు |
| బీజావాహనం | 2, 3, 5, 7 9 10, 11, 12, 13 | సోమ, బుధ గురు, శుక్ర | (అశ్వి), రో, పుష్య, మఖ, ఉత్తరాత్రయం, హస్త స్వా, అనూ, మూల, శ్ర, శత, రే (మృ, పున, ధని) | వృష, కర్కట, సింహ (తుల) మక, (కుంభం, మీనం) | అష్టమశుద్ధి 3, 6 లలో శుభం |
| దేవతాప్రతిష్ఠ | 2, 3, 5, 7, 8 10, 11, 12, 13 | ఆది, సోమ బు, గు, శు | అశ్వి, రో, మృగ, పున, పుష్య, ఉత్తరాత్రయం, హ, చి, స్వా, అనూ, శ్రవ, ధని, శత, రేవతి | వృష, వృశ్చి, సిం, కన్య ధను, కుంభం, మీనం | శుభులకు ఉత్తరాయనం మిగిలినవార్కి దక్షిణాయనం |
| యాత్ర | 2, 3, 5, 7 10, 11, 13 | బుధ, గురు, శుక్ర | అశ్వి, రో, మృ, పున, పుష్య, (ఉత్తరాత్రయం) హ, అమా, (మూ), శ్రవ, ధ, (శత) రేవతి | మేష, కటక, తుల, వృశ్చి ధను, మకర, మీనం | పంచమశుద్ధి వారశూలలు కూడవు. |
| హలకర్మ | 2, 3, 5, 7 10, 11, 13, 15 | ఆది, మంగ బుధ, గురు | అశ్వి, రో, మృగ, పున, పుష్య, మఖ, ఉత్తరాత్రయం హ, చిత్త, స్వా, వి, అమా, మూల, శ్ర, ధ, శత | వృష, మిధున, కన్య, వృశ్చి ధను, మీనం | కర్తరి కూడదు. |
| క్రయవిక్రయ వాణిజ్యారంభం | 2, 3, 5, 7 10, 11, 13, 15 | ఆది, సోమ బుధ, గురు శుక్ర, శని | అశ్వి, భర, కృత్తి, రో, మృ, (ఆర్ద్ర), పుష్య, ఆశ్లే పూర్వాత్రయం, ఉత్తరాత్రయం, హ, చి, స్వా (విశా), అనూ, శ్రవ, శత, రేవతి | కుంభ – వివా– | శుచ. శుభయుతం, అష్టమ దశమశుద్ధి శుద్ధి 12, 2, 11 శుద్ధి |

**శుభకర్మములయందు మహాదోషకములు :** దుష్టతిథి, వారనక్షత్ర, యోగకరణములు (విష్కంభం, అతిగండ, శూల, గండ, వ్యాఘా, పరి, వ్యతీ, పరిఘ, వైధృతి, దుష్టయోగము, విష్టి, శకుని, చతు, నాగ, కింస్తుఘ్నము) సంక్రాంతి, ఆయనదినములు, పాపాక్రాంత పాపదృష్టి లగ్నములు, అష్టకుజుడు, షష్ట శుక్రుడు, పాపగ్రహకర్తరి, జన్మలగ్న చంద్రలగ్నములకు అష్టమలగ్నము, షష్ఠాష్టమ ద్వాదశములలో చంద్రుడు పగ్రహ చంద్రుడు, వేదాక్రాంతలు, గ్రహణ నక్షత్రము, వర్జ్య దుర్ముహూర్తములు, తిథి నక్షత్ర లగ్న చంధులు, మహాపాతలు ఇవి విడువదగినవి. శుభ ముహూర్తములకు మహా దోషములను విడువవలెను. ఆయా శుభకర్మలకై ఇందు చెప్పబడిన తత్కాలమునున్నవి యగు తిథి పక్షాది నుండి లెక్కింపవలెను. వార నక్షత్రలగ్నము తిథులను గలిపి 9చే భాగించగా నగు శేషము 1, 2, 4, 6, 8 యగుచోనని క్రమముగ మృత్యు, అగ్ని, రాజ, చౌర, రోగ, భయములను చేయును. 3, 5, 7, 9, ఇవి శేషమగుట శుభము. 1–2 మిక్కిలి దషం. గత తిథి లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించుట మతాంతరము. ధ్రువకము కలుపుట శాస్త్రీయము కాదు.

# దినాధిపతులు - తారాబల - చంద్రబలముల గణన చక్రం

**నిత్య నక్షత్రమును, జన్మ లేక నామ నక్షత్రమును ఎదురు గడిలో వున్న - దినాధిపతిని, దినాధపతి వద్ద నున్న అంకె ద్వారా తారాబలమును తెలుసుకోవలెను.**

| నిత్య నక్షత్రములు → జన్మ నక్షత్రములు ↓ | | | అశ్వని మఖ మూల | భరణి పుబ్బ పూర్వాషాఢ | కృత్తిక ఉత్తర ఉ.షా.ఢ | రోహిణి హస్త శ్రవణం | మృగశిర చిత్త ధనిష్ఠ | ఆర్ద్ర స్వాతి శతభిషం | పునర్వసు విశాఖ పూ.భాద్ర | పుష్యమి అనురాధ ఉత్తరాభాద్ర | ఆశ్రేష జ్యేష్ఠ రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అశ్వని | మఖ | మూల | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 |
| భరణి | పుబ్బ | పూ.షా. | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 |
| కృత్తిక | ఉత్తర | ఉ.షా. | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 |
| రోహిణి | హస్త | శ్రవణం | బుధ 7 | చం 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 |
| మృగశిర | చిత్త | ధనిష్ఠ | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 |
| ఆర్ద్ర | స్వాతి | శతభిషం | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 | రవి 4 |
| పునర్వసు | విశాఖ | పూ.భా. | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 | కుజ 3 |
| పుష్యమి | అనురాధ | ఉ.భా. | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 | గురు 2 |
| ఆశ్రేష | జ్యేష్ఠ | రేవతి | గురు 2 | కుజ 3 | రవి 4 | రాహు 5 | శుక్ర 6 | బుధ 7 | చంద్ర 8 | కేతు 9 | శని 1 |

**తారాబలం :** 1. జన్మతార, 2. సంపత్తార, 3. విపత్తార, 4. క్షేమతార, 5. ప్రత్యక్తార, 6. సాధన తార, 7. నైధనతార, 8. మిత్రతార, 9. పరమ మిత్రతార. వీనిలో 2, 4, 6, 8, 9 మంచివి. 1, 3, 5, 7 మంచివి కావు.

**చంద్ర బలం :** మీ జన్మరాశికి చంద్రుడు శుక్లపక్షంలో 2-5-9 స్థానాల్లోనూ, కృష్ణపక్షంలో 4-8-12 స్థానాల్లోనూ, ఉభయ పక్షములందునూ కూడా 6-7-10-11 స్థానాల యందునా యున్నచో శుభము.

**దినాధిపతులు వారిచ్చు ఫలములు :** 1. రవి-వికలత, గొప్పవారి దర్శనం. సాహస కార్యలాభం, 2. చంద్రుడు - సుఖము, శాంతి, 3. కుజుడు - మనోవేదన, 4. బుధుడు - కష్టం మీద పనులగుట, సుఖశాంతులు, 5. గురుడు - సర్వత్రా శుభం, 6. శుక్రుడు - సర్వత్రా శుభం, 7. శని - పీడ, దుఃఖం, 8. రాహువు మరియు 9. కేతువు - అరిష్టం, అపనిందలు